శ్రీరామచంద్ర.

# [illegible]

గ్రంథకర్త:

మద్దూరి శ్రీరామమూర్తి



ప్రకటనకర్తలు:

పసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు,

బుక్కు-సెల్లర్సు, రాజమండ్రి.

రెండవకూర్పు 1000 ప్రతులు.


కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1926.


 [వెల రు 1 ౦ ౦]

# పీఠిక.

భాషాభిమానులారా!

శ్రీనాథకవిసార్వభౌముని గూర్చి పెక్కుకథలు వినవచ్చుచున్నవి గాని యెల్లరును యొక్కతీరున నేజెప్పక వేఱు వేఱుగఁ జెప్పుచున్నారు. కొన్నికథలు గ్రంథములందు గాననగును. మిగిలినవి యెన్ని గ్రంథములఁ బరికించినను లభ్యములు కావు. అట్టికథలను, పెద్దలవలన వినిన కథలను సంపుటీకరణ మొనర్చితిని. కథలతోఁ గూడ నాతని సంగ్రహ చరిత్రంబును, యాతఁ డాశ్రయించిన రెడ్డిభూపాలుర సంగ్రహ చరిత్రమును గూడ చేర్చి శ్రీనాథకవి చరిత్ర మని పేరిడితిని.

నాకు లభించిన కథలనుమాత్రమే వ్రాసితిని. మిగిలియున్న కథలను వినియున్నచో వారు యెవరైన దయతో నా కెఱిఁగించిన రాబోవుముద్రణమందు సాధ్యమైనంతవఱకుఁ జేర్చెదను

ఈగ్రంథరచనాసందర్భమున "ఆంధ్రకవుల చరిత్రము, చాటుపద్యమణిమంజరి" మున్నగు గ్రంథములు నాకు విశేష సహాయ మొనర్చియుండెను నేను శ్రీనాథుని చరిత్రమును వ్రాయుచుంటినని విని శృంగారశ్రీనాథ మను రసికాభిలాషమును సంపాదించి నా కొసంగిన మ॥ రా॥ రా॥ అళక్కి వెంకటసుబ్బారావుగారికి నాకృతజ్ఞతాపూర్వకవందనములు.

ఇయ్యదియే నా ప్రథమప్రయత్నమగుటచే యిందనేకలోపము లుండిన నుండవచ్చును. అట్టిలోపములను నా కెఱిఁగించిన యెడల ముందు సవరించుకొందును.

కాకినాడ,
30-12-1926.

…ట్లు,
…మూర్తి,



# ప్రకటన.

ఈ గ్రంథము మదరాసు కాపీరైటు ఆక్టుప్రకారము సర్వాధికారములును యీదిగువ సంతకము చేసిన మాకు చెందియున్నవి. గావున దీని నంతయుగాని కొంతగాని యెవ్వరును ముద్రింపఁగూడదు.

వసుపులేటి వెంకటాద్రియయ్య అండ్ బ్రదర్సు,
బుక్‌సెల్లర్సు, ఇన్నీసుపేట,
రాజమండ్రి.

# విషయసూచిక



# ఇష్టదేవతా ప్రార్థన.



శ్లో. శ్రీవ్యాసాదిమహర్షి చంద్రవినుతం విజ్ఞాన తేజోమయం
భక్తాగ్రేసర వాంఛితార్థసుఖదం పరిస్వ్యమ్నగర్వాంతకం
జన్మవ్యాధిజరావిపద్విరహితం ఘోరాహి సద్భూషితం
దేవం భక్తవశంకరం పురహరం శ్రీపార్వతీశం భజే.

సీ. మును భోజునాస్థాన । భూస్థలి కాళిదా
సుని బెంపుఁ జేసిన । శుద్ధకరుణ
కాదంబరీ కావ్య । ఘటనాదియందున
బాణుని గనుఁగొన్న । భవ్యదయయు
ఆంధ్రిమహాభార । తామ్నాయ కృతియందు
ఘనకవిత్రయి నేలు । కారుణికము
మనుచరిత్రంబును । వినుచు వేళను సదా
పెద్దన్నపై నించు । ప్రేముడియును
నైషధగ్రంథ మొనరించు । నాఁడు మిగుల
మనిచి పెనిచిన శ్రీనాథు । మన్ననంబు
నాపయిని గొంత రానిమ్ము । నయగుణప్ర
పూరితాఖిలచణి స్వాయం । భువుని రాణి.

గీ. శ్రీజగన్నాథు మహిత ల । క్ష్మీసనాథు
రాక్షసానీక సంహారు । ప్రథితశూరు
ము[illegible] । పు[illegible]శీలు



శ్రీరస్తు.

# శ్రీనాథకవి చరిత్రము.

## సంగ్రహ వృత్తాంతము.

నానావిధాలంకారసమన్వితం బైనట్టి యాంధ్రభాషామతల్లిని శక్తివంచన లేకుండ, విసువుఁ జెందక, కష్టనిష్ఠురంబులఁ బాటింపక, విశేషశ్రమ కోర్చి తమతమ యోపినకొలందిని సేవించి చిరంబగు కీర్తి గణించి పెక్కురు కవీశ్వరులు ధన్యాత్ములైరనుట నిర్వివాదాంశము గదా! అట్టివారిలోఁ జేరిన మహనీయుఁడే శ్రీనాథుఁడు.

ఈతని శక్తిసామర్థ్యంబుల కచ్చెరువడి యనేక పండితులును మహారాజులును గలసి శ్రీనాథునకు "కవిసార్వభౌముఁడు" అను బిరుదం బొసంగిరి ఈతనిచే రచియింపఁబడిన గ్రంథము లన్నిటిలోను జగద్విఖ్యాతిఁ గనిన "శృంగారనైషధము" గాంచి, నాఁటినుండియు "శృంగార శ్రీనాథకవిసార్వభౌమా!" అని పిల్చుచుండెడివారు.

ఈ కవిసార్వభౌముఁడు యజుశ్శాఖీయుఁడు, నియోగి, భారద్వాజసగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు.

"శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబ సత్సూత్రుని"

.............................................................

అని తన శృంగారనైషధమందుఁ గృతిపతి తన్నుద్దేశించి చెప్పె

నట్లుగా నీ పద్యముఁ జెప్పెఁ దన వంశానుక్రమ మిక నట్లు చెప్పలే నెను. అట్లు చెప్పుటలోననే తన జననీజనకులఁ గూర్చియుఁ దెలియఁ జెప్పి యున్నాఁడు.

"శా. ..............................................వి

<u>ద్యారాజీవభవుండు మారయకుఁ బు । ణ్యాచారభీమాంబకున్</u>

<u>గారా మైనతనూజు</u> నన్ననఘు శ్రీ । నాథాఖ్యునుం బిల్చి స

త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ । గంభీరవాక్ప్రౌఢిమన్."

ఇంతియే కాక హరవిలాస మను శైవప్రబంధమునందును దన తలిదండ్రుల నామముల నిట్లు పేర్కొనియున్నాఁడు.

సీ. కమలనాభుని పౌత్త్రుఁ । గవితామహారాజ్య
భద్రాసనారూఢుఁ । బరమపుణ్యుఁ
బాత్త్రు నాపస్తంబ । సూత్రు భారద్వాజ
గోత్రు సజ్జనమిత్త్రుఁ । గులపవిత్త్రు
భీమాంబికామార । యామాత్త్య నందను
నఖిల పురాణ వి । ద్యాప్రవీణు
నధ్వర్యు వేదశా । ఖాతిథినిష్ణాతు
నాంధ్రభాషానైష । ధాబ్జభవుని

తే. గీ. యుభయభాషాకవిత్వప్రి । యోగకుశలు
బాలసఖు గారవించి తా । త్పర్య మెసఁగ
నవచి దేవయ త్రిపురారి । యక్షరాజు
హితమిత్త్రోక్తులు వెలయంగ । నిట్టు లనియె.

ఆశ్వాసాంతగద్యములందుఁగూడఁ దన తండ్రి తాతల నామములను స్పష్టీకరించియున్నాఁడు.

1. శివరాత్రిమాహాత్మ్యము. 2. శృంగారనైషధము. 3. హరవిలాసము. ఈ గ్రంథత్రయంబునందుననుగూడ:—

గద్య. ఇది శ్రీమత్కమలనాభామాత్యపౌత్ర మారయామాత్య పుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథ ప్రణీతం బైన......................

ఇట్లిన్నిగ్రంథ రాజములయందుc దన తల్లిదండ్రుల నామము లను, తాతగారి నామమును శ్రీనాథుఁడు తన స్వహస్తములతోఁ గమలనాభామాత్యునిపౌత్రుఁడ ననియు, మారయామాత్యుని పుత్రుం డననియు వ్రాసికొనియుండఁ గొందఱా వ్రాఁతను గమనింపకుండఁగనే "అమరామాత్యుఁడు శ్రీనాథకవిసార్వభౌముని తండ్రి" అని యనుచుం డిరి. ఇట్లనుటకు వారికే యాధారములు లభ్యమైనవో యేమో తెలియంగరాకున్నది.

పైనఁ జూపించిన యాధారములంబట్టి శ్రీనాథుని తాత కమల నాభామాత్యుఁడనియుఁ దండ్రి మారయామాత్యుండనియుఁ దల్లి భీమాంబ యనియు స్పష్టపడుచున్నది.

ఈతఁడు శైవుఁడైన పాకనాటి నియోగి బ్రాహ్మణుఁడు. ఈ యంశమును దన భీమఖండమునం దిట్లు పేర్కొనియున్నాఁడు.

సీ. వినిపించినాఁడవు । వేమభూపాలున
కఖిలపురాణ వి । ద్యాగమములు
కల్పించినాఁడవు । గాఢపాకం బైన
హర్షనైషధకావ్య । మాంధ్రభాష
భాషించినాఁడవు । బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ । వేళలందు
వెదఁజల్లినాఁడవు । విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాం । గణములందు
పాకనాటింటివాఁడవు । బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ । వమలమతివి

నాకుఁ గృపసేయు మొకప్రబం / ధంబు నీవు
కలితగుణగణ్య శ్రీనాథ / కవివరేణ్య.

పాకనాటిసీమ స్థల నిర్ణయము:—

గుంటూరుమండలములోని "కొండవీడు" మొదలుకొని నెల్లూరు మండలమందలి "కంకరూరు" వఱకును పాకనాటిసీమ యని పెద్దల యభిప్రాయము.

ఈతని పితామహుండగు కమలనాభుఁడు గొప్ప పండితుఁడు. కవీశ్వరుఁడు. పద్మపురాణ మాంధ్రీకరించెను. కమలనాభామాత్యుఁడు పాకనాటిసీమలోని సముద్ర తీరపట్టణమగు క్రాల్పట్టణమునందు నివసించు వాఁడని యీ క్రిందిపద్య ముద్ఘోషించుచున్నది.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీ / క్రాల్పట్టణాధీశ్వరుం
ఘనునిం బద్మపురాణసంగ్రహకళా / కావ్యప్రబంధాధిపుం
వినుమధ్యాంతర సార్వభౌముఁ గవితా / విద్యాధరుం గొల్తు నా
యనుఁగుం దాతఁ బ్రదాత శ్రీకమలనా / భామాత్యచూడామణిన్.

తన పితామహుఁడు కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడీ క్రింది పద్యములో వర్ణించుకొనియున్నాఁడు.

తే. గీ. మత్పితామహుఁ గవితా / మహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభు / కమలనాభుఁ
జంద్రచందనమందార / సదృశకీర్తి
సరససాహిత్యసామ్రాజ్య / చక్రవర్తి.

కమలనాభుఁడు కరణముగానుండిన "క్రాల్పట్టణ" మిప్పు డెచ్చట నుండెనో తెలియవచ్చుట లేదు. ఈ పట్టణమును సముద్రము తన గర్భమునందున దాచికొనియున్నదో, లేక మారుపేరు ధరించికొని యున్నదో, యెవ్వరును జెప్పఁజాలక యుండిరి. అందుచే నీపట్టణమిది యని నిరూపించుట కాధారము లేదు.

కమలనాభుఁడు గ్రామకరణ మగుటచే నాతని కుమారుఁడును శ్రీనాథుని తండ్రియు నగు మారయామాత్యుఁడు కూడ నా పట్టణము ననే యుండిన నుండవచ్చును. హరవిలాసకృతిపతి కమలనాభు నెఱింగి నట్లుగాఁ జెప్పియుండుటచే నాతఁ డించుమించుగా 1380 సంవత్సరము వఱకును జీవించి యుండవచ్చును. పై కారణములచే శ్రీనాథుని జన్మస్థానముగూడ యీ కాల్పట్టణమే యైయుండిన నుండవచ్చును. కాని నొక్కి వక్కాణించుట కనువగు సాధనము లేమియును గానరావు.

శ్రీనాథుఁడు తన పితామహునిఁ బొగడినట్లుగాఁ దన తండ్రి నే గ్రంథమునందును బొగడలేదు. అందుచే శ్రీనాథుని తండ్రియగు మారయామాత్యుఁడు పండితపుత్రుం డగునేమో యని పలువు రభిప్రాయ పడుచున్నారు.

## శ్రీనాథుని జన్మకాల నిర్ణయము.



శ్రీనాథుఁ డెప్పుడు జన్మించెను? ఈ ప్రశ్నకుఁ దగిన సమాధానము లభించుట లేదు. ఈతని జన్మవత్సరముఁ గూర్చి పలువురు పలువిధాభిప్రాయులై యున్నారు. ఇంచుమించుగా నీతఁడు 1365 సం॥ 1380 సం॥ మధ్య జన్మించియుండవచ్చునని యభిప్రాయపడుచున్నారు. ఆ యభిప్రాయముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాను.

బ్రహ్మశ్రీ కూనపులి లక్ష్మీనరసయ్యశాస్త్రిగారి యభిప్రాయము:—

"ఇంచుమించుగా నీతని యేబదియవయేట రచించిన" 'కాశీఖండము'ను వీరభద్రారెడ్డి కంకిత మొసఁగియుండెను. ఈతఁడు 1426 సం॥ రాజమహేంద్రవరసింహాసన మధిష్ఠించెను. 1430 సం॥ ప్రాంతమున నితఁ డత్యున్నతుఁడై యుండెను. 1443 సం॥ నకే యీతని రాజ్యమంతరించిపోయెను. ఈ మధ్యస్థకాలమున నెప్పుడో యొకప్పుడా కాశీ

ఖండమును వీరభద్రారెడ్డి కంకిత మిచ్చెను. కాశీఖండమున శ్రీనాథుఁడేబదియవ సంII న వ్రాసియుండుటచేత యాతని జన్మము 1375-80 మధ్య జన్మించియుండవచ్చును"

బ్రహ్మశ్రీ రావుబహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారి యభిప్రాయము:—"హరవిలాసమును గృతిఁగొన్న తిప్ప ప్రభుని సోదరుండగు తిరుమలనాథసెట్టి, ఫిరోజిమహా, కుమారగిరిరెడ్డి, హరిహరరాయలు రాజ్యపరిపాలన మొనర్చుచుండఁగాఁ గుమారగిరిరెడ్డి వసంతవైభవముల నిర్వర్తించువాఁడని హరవిలాసములోని యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

చం. హరిహరరాయ ఫేరొజిమ । హా సుంతానిగజాధిపాధి భూ
వరులు నిజప్రభావ మభి । వర్ణనఁ జేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము । సర్వము నెట్టన నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికివి । ధీగుణ ఘట్టికి నెవ్వఁ డీడగున్.

ఇట్లనుటచే హరవిలాస మీరాజులు మువ్వురు జీవించియుండఁగనే రచియింపఁబడి యుండవచ్చును. శ్రీనాథుఁ డించుమించుగాఁ దన ముప్పదియవయేట నీ హరవిలాసమును రచియించియుండవచ్చును. ఈరాజులు మువ్వురును 1400 సంవత్సరములలోపుననే గతించిపోయిరి. కావున నాహరవిలాస మాసంవత్సరమునఁగాని యంత కొకటి రెండు సంవత్సరములు వెనుకఁగాఁ గాని కృతి నిచ్చియుండవచ్చును. పైకారణములఁ బట్టి యూహింపఁగా శ్రీనాథుని జననము 1370-75 లోపున నయియుండవచ్చును"

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము:—

వీరు చాటుపద్యముల నెత్తి వ్రాయుచు "శ్రీనాథుఁ డించుమించుగా 1375-1380 సంవత్సరము లోపున జన్మించియుండవచ్చును" అని వ్రాసియున్నారు.

ఇట్లే మఱికొందఱుకూడ దమతమ యభిప్రాయముల నిచ్చియున్నారు ఎవ్వరెన్నియభిప్రాయములొసఁగినను నీ కవిసార్వభౌముఁడు క్రీ॥ శ॥ 1365-1380 సం॥ మధ్య జన్మించియుండు ననునది మాత్రము నిర్వివాదాంశము.

# రెడ్డిరాజుల సంగ్రహచరిత్రము.



## 1 వ భాగము.

1320 వ సంవత్సరములో రెడ్డిరాజ్యమును స్థాపించినవాఁడు "కోమటిపోలయ వేమారెడ్డి." ఈతఁడు రాజ్యమును స్థాపించిన పిమ్మట తమ్ములకును, నన్నగారికిని జిన్నచిన్న సంస్థానములనొసంగి వారి నాదరించెను. ఈయంశమే హరివంశములోని యీ క్రిందిపద్యము తెలుపుచున్నది.

"తే. గీ. తనకు నద్దంకి తగురాజ । ధానిగాఁ బ
రాక్రమంబున బహుభూము । లాక్రమించి
యనుజ తనుజ బాంధవ మిత్ర । జనుల కిచ్చె
నకట యెవ్వారు వేమమ । హీశ్వరునకు."

ఆతని యనంతర మాతని కుమారుం డగు "అనపోతారెడ్డి" రాజ్యపాలనమునకు వచ్చెను. ఈతఁడు 1350-1362 సం॥ వఱకును రాజ్యపాలన మొనరించెను. ఈతని కుమారుఁడే "కుమారగిరిరెడ్డి"

అనపోతారెడ్డి పండ్రెండు సంవత్సరములు జనుల ప్రాగట్తుల కెక్కునట్లు రాజ్యపాలన మొనరించి స్వర్గస్థుఁడయ్యెను. ఈతఁడు చనిపోవుకాలమునఁ దీని కుమారుఁడగు "కుమారగిరిరెడ్డి" బాలుఁడైయున్నకారణమునఁ ననపోతారెడ్డి సోదరుఁ డగు "అనవేమారెడ్డి" రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు 1362 సం॥ మొదలు 1383 సం॥

వఱకు రాజ్యపాలన మొనరించెను. ఈతఁడు మంచి దాత. పండితు లను, కవీశ్వరులను విశేషముగా సన్మానించువాఁడు. సహజముగ నన వేమారెడ్డి పండితుఁడు. రసజ్ఞుఁడు. ఈతఁడు పూర్వు లేర్పఱచిన రాజధానియగు నద్దంకిని విడచి కొండవీడు రాజధానిగాఁ జేసికొనెను.

ఈ యనవేమమహీపాలుని గుఱించి జగద్విదితమైన యొకకథ గలదు. దాని నీక్రిందఁ బొందుపఱచుచున్నాను.

ఒకానొక నియోగికవీంద్రుఁ డీయనవేమారెడ్డి దాతృత్వముఁ గూర్చి విని యాతనివలనఁ దన దరిద్రము బాపుకోఁదలంచి, యొక శ్లోకమును వ్రాసి దానిని బట్టుకొని యనవేమారెడ్డికడ కరిగి యాత నిని దర్శించి—

శ్లో. అనవేమమహీపాల ! స్వస్త్యస్తు తవ బాహవే !
ఆహవే రిపుదోర్దండ ! చంద్రమండలరాహవే॥

అని యాతనిపై వ్రాసిన శ్లోకమును బఠించెను. ఆ శ్లోక మన వేమారెడ్డి యాలించి సంతసించి యాతనిని బహూకరింపనెంచి మూఁడు వేలరూప్యంబులఁ దెప్పించి యొక పళ్ళెరమందుంచి యాతని కందిం చెను కవీశ్వరుఁ డాపళ్ళెరమం దున్నద్రవ్య మొంతయో గ్రహించి యాపళ్ళెర మందుకొనక మిక్కిలివినయముతో నిట్లనియెను. "భూపాల మౌళీ ! తమ కిది న్యాయమా ? నేను తమకు నాల్గు 'వే' లిచ్చి తిని తను రిప్పుడు నాకు మూఁడువే లొసఁగుచుంటిరి. న్యాయము దయసేయుఁ" డనెను. అనవేమారెడ్డి యావాక్యము లాలించి "నీవు మా కొసంగిన నాల్గు 'వే' లు యేమి?" అని యడిగెను.

పాదంబున కొక్క "వే" మీ కొసంగితిని జూచుకొం డని కవీ శ్వరుఁడు మఱల నాశ్లోకముఁ జదివి వినిపించెను.

కవీంద్రుని యుక్తి కెంతయో సంతోషించి యాతనికి బహుమానముగా నాల్గువేలరూప్యంబు లొసంగఁబోయెను. కవీశ్వరుఁ డదియునుం గైకొనక—

"ప్రభూ! నూఱు మా కొసంగుట మఱి మాన్యము లొసంగుటగునా? దానకర్ణులని జగద్విఖ్యాతిఁ గనిన దేవరవా రిట్లు చేయుదురని నే ననుకొనలేదు." అనెను.

అనవేమారెడ్డి యెంతయో సంతోషించి యైదువే లీయఁబోయెను. కవిచంద్రుఁ డది గాంచి మిక్కిలి వినయముగా నిట్లనియెను.

"ధరారమణా! నే నాఱువేలనియోగిబ్రాహ్మణుఁడను. అట్టి నా కైదువే లొసంగి నన్ను గొంచపఱచుట దేవరకు భావ్యము గాదు."

ఈచిత్రమేమియో చూతమని యింకొక వేయిరూప్యములు దెప్పించి యాఱువేలును నీయఁబోఁగా నక్కవి తీసికొనక సవినయముగా—

"రెడ్డిరాట్కులతిలకా! నేను జన్మించినప్పుడే యాఱువేలు సంపాదించితిని. ఇప్పుడు తమరు నాయందుఁ జూపిన యాధిక్య మేమున్నది?" అనెను.

అంత ప్రభూపాలుండు మాటాడక యేడువే లొసంగఁబోయెను. దానిని గూడ నాకవి గ్రహింపక యిట్లనియెను.

"మీ రొసంగఁబోయెడి యీవి నాకు నచ్చినది గాని సంఖ్య రోదనసంఖ్యయై యొప్పియున్నది. అట్టి సంఖ్యతోఁగూడిన బహుమాన మైశ్వర్యకాములగు దేవరవా రీయఁజనదు. ఇదివఱకే దరిద్రదేవిచే నిడుములంగుడుచుచున్న నేను గైకొనఁదగను."

రా జాతని చమత్కారమున కలరి యింకొక్కవేయి దెప్పించి మొత్త మెనిమిదివేలును నొసంగెను. మారువమాటాడకుండ కవీశ్వరుఁ డా దానమును స్వీకరించెను.

ఈ యనవేమారెడ్డి 1383 సం॥ దివం బలంకరించెను. ఈతని యనంతర మీతని యన్న యగు ననపోతారెడ్డి కుమారుండగు కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు 1400 సం॥ వఱకును రాజ్యమును జేసి పరలోకగతుఁ డయ్యెను. ఈతని కాలముననే మన శ్రీనాథకవిసార్వభౌముఁడు రాజమంత్రులకును దక్షితరులకును గృతు లీయ నారంభించెను.

కుమారగిరిరెడ్డి విద్యావంతుఁడు. ఈతఁడు రాజ్యపరిపాలనము నందుకంటె వినోదకార్యములయం దాసక్తి మెండుగాఁ గలవాఁడఁట. ఆకారణమున రాజ్యభార మంతయుఁ దన మఱఁదియగు కాటయవేముని పైఁ బెట్టివైచి స్వేచ్ఛాచారుఁడై యుండెడివాఁడట. ఇట్లీకుమారగిరిరెడ్డి 1383 సం॥ మొదలు 1400 వఱకును రాజ్యపాలన మొనరించి తుదకు సంతానహీనుఁడై పరమపదించెను.

ఈతని యనంతరమున నీతని పెదతాతయగు మాచన మనుమఁడైన పెదకోమటివేముఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు కొండవీటి రాజ్యముతోఁ దృప్తినొందక రాజమహేంద్రవర రాజ్యమునుగూడ వశపఱచుకొనఁగోరి చతురంగబలంబులతో దండయాత్రకు వెడలి కుమారగిరిరెడ్డి మఱఁదియగు కాటయవేమారెడ్డిచేతను, యాతని దండనాథుఁడైన యల్లాడరెడ్డిచేతను బరాభవింపఁబడెను. తరువాత నీతనికుమారుఁడగు రాచవేముఁడు 4 సంవత్సరములే రాజ్యపాలన మొనరించెను. ఇంతతో యీ రాజ్యము కర్ణాటులపాలయిపోయెను. చదువరుల కీయంశమంతయు బాగుగా నర్థమగుటకుఁగాను యీ దిగువ వంశవృక్షము జూచుకొనుఁడు.




అనవేముడు

కూతురు

[illegible]లింగము

వేమాంబిక

అల్లాడరెడ్డి

[illegible] ద్రారెడ్డి

పెదకోమటివేముని కాలములోననే శ్రీనాథుఁడు విద్యాధికారిగా నియమింపఁబడియెను. కాని శ్రీనాథుఁ డాతని కేకారణముననో నొక్క కృతియును నీయలేదు.

కోమటివేముని భార్య సూరమాంబ "సంతానసాగరము" అను నొక గొప్పతటాకమును త్రవ్వించెను. ఆ తటాకప్రతిష్ఠావసరసమయమున శ్రీనాథుఁ డొక శాసనమును రచించెను. ఆశాసనము గ్రంథాంతమం దీయఁబడినది.

# రెడ్డిరాజుల చరిత్రము

2 వ భాగము.

రాజమహేంద్రవరము గూడ కొండవీటిలోఁ జేరినదైనను కుమారగిరిరెడ్డి తన చెల్లెలయిన మల్లాంబికకుఁ బసుపుకుంకములకై 1386 సం॥ లో నొసంగియుండెను. మల్లాంబ భర్త కాటయవేముఁడు. ఈతఁడే తన బావమఱఁదియగు కుమారగిరిరెడ్డికి సహాయుఁడై కొంతకాలము కొండవీటి రాజకార్యనిర్వాహణభారము వహించెను. ఈతఁడే తన దండనాథుండైన యల్లాడరెడ్డి సహాయమున గోమటివేముని పీచ మడచినవాఁడు. ఈతఁడు మంచిశూరుఁడు. సమర పాండిత్యమే గాక భాషాపాండిత్యము గూడ గలవాఁడై కాళిదాసవిరచితమైన నాటకములకు సంస్కృతమున వ్యాఖ్యానము వ్రాసెను.

సంస్కృతముననే గాక యాంధ్రమునందును, మంచిమంచి పాండిత్యముగలవాఁడై కవుల నాదరించి వారిచే శ్లాఘింపఁబడెననుట కీ క్రిందిపద్యము దృష్టాంతముగా నున్నది.

కం. వెలయాలు శిశువు నల్లుఁడు
నిలయేలిక యాచకుండు ! నేగురు ధరలోఁ

గలిమియు, లేమియుఁ, దలఁపరు
కలియుగమునఁ గీర్తికాము ? కాటయ వేమా !

ఈ కాటయ వేమారెడ్డి కొక కుమారుఁడును, నొక కుమార్తెయుఁ గలరు. కుమారునకుఁ దన బావమఱఁది యగు కుమారగిరిరెడ్డి నామమే పెట్టెను. కూఁతునకు "అనితల్లి" అను నామ మొసంగెను. విధి వశంబున తన కుమారున కింకను యుక్తవయస్సు రాకమునుపే కాటయ వేమారెడ్డి స్వర్గమున కరుగవలసి వచ్చెను. కాటయవేముఁడు మరణ శయ్యపై నుండి దండనాయకుం డైన యల్లాడరెడ్డిని బిలిపించి సమీపమునఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లనియెను.

"అల్లాడరెడ్డీ! నా కవసానకాలము సమీపించినది. నా కుమారున కింకను స్వయముగా రాజ్యపరిపాలనము చేయుఁగల సామర్థ్యము లేదు. నాకు ముఖ్యబాంధవులు నీకంటె నెవ్వరును లేరు. నీవు నా పినమామగారి దౌహిత్రిరాల నుద్వాహ మాడుటచే నాకుఁగూడ నల్లుఁడవే. నా యనంతరమున వైరులు విజృంభింపకుండ వారి నణఁచి రాజ్యమును నిలువంబెట్టు భారమును నీభుజస్కంధముపై నుంచితిని. నా కుమారీమణి యగు 'అనితల్లికి' దగిన సంబంధముఁ జూచి యుద్వాహ మొనరింపుము. నా పుత్రుని గాపాడుము." అని యొప్పగించి కాటయవేముఁడు తన భౌతికదేహము విడచిపెట్టెను.

కాటయవేముని కుమారుం డగు కుమారగిరిరెడ్డి తండ్రి గతించిన కొలఁదికాలములోననే యకాలమృత్యువు వాతం బడెను. కాటయ వేముని కుమార్తెయగు "అనితల్లి" యే రాజ్యాధికారిణి యయ్యెను. ఈసమయమును వృథాగాఁ బోఁగొట్టుకొనుట కిష్టములేక యల్లాడ రెడ్డి తన ద్వితీయ కుమారుం డగు వీరభద్రారెడ్డి కా యనితల్లి నిచ్చి బరిణయముఁ గావించి, మెల్లగా రాజ్యమును దన వంశములోని కీన్చ

కొనియెను. అల్లాడరెడ్డి 1426 సం॥ గతింపఁగనే రాజ్యలక్ష్మి యంతల్లి మనోహరుం డగు వీరభద్రారెడ్డి వశమైపోయెను.

వీరభద్రారెడ్డి 1426 సం॥ సింహాసన మధిష్ఠించెను. ఈ కాలముననే మన శ్రీనాథుడు రాజమహేంద్రవరముం బ్రవేశించి ప్రధాన మంత్రియైన బెండపూడి యన్నామాత్యుని యాశ్రయించి, మెల్ల మెల్లగా వీరభద్రారెడ్డి యాస్థాన కవియై, తన కాశీఖండమును వీరభద్రారెడ్డి కంకితం బొనంగెను. క్రీ॥ శ॥ 1443 సం॥ రెడ్డిరాజ్య మను గంటిపోయి విజయనగరమువారి పాలయిపోయినట్లు కొన్ని శాసనముల వలనఁ దెలియవచ్చుటం జేసి వీరభద్రారెడ్డి యంత కొకటి రెండు సంవత్సరముల వెనుక మరణించియుండు నని యూహింపవలసి యున్నది.

# శ్రీనాథవిరచిత గ్రంథములు.

శ్రీనాథుఁ డించుమించుగాఁ దన పదునాఱవయేట గ్రంథరచన కారంభించినట్లూహింపవలసియున్నది. మొత్తము మీఁద నితఁ డించుమించుగాఁ బది గ్రంథములు రచియించినట్లున్నాఁడు. అందుఁ గొన్నిపుస్తకములు మాత్రమే లభ్యములు. కొన్నిపుస్తకము లెక్కడనో నామమాత్రావశేషము లై యణఁగి మణఁగి యున్నవి.

శ్రీనాథుఁడు తన కాశీఖండమునందుఁ దాను రచించిన పుస్తకములలోఁ గొన్నిటినిమాత్రమే యిట్లు పేర్కొని యున్నాఁడు.

సీ. చిన్నారి పొన్నారి । చిఱుత కూకటినాఁడు
రచియించితి మరుత్త । రాట్చరిత్ర
నూనూఁగు మీసాల । నూత్నయౌవనమందు
శాలివాహనసప్త । శతి నొడివితి

సంచరించితి నిండు । జవ్వనంబునయందు
హర్షనైషధ కావ్య । మాంధ్ర భాష
ప్రౌఢనిర్భరవయః । పరిపాకమునఁ గొని
యాడితి భీమనా । యకుని మహిమ
గీ. ప్రాయ మింతకు మిగులఁ గై । వాలకుండఁ
గాశికాఖండ మను మహా । గ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాట । దేశ కటక
పద్మవన హేళి శ్రీనాథ । భట్ట సుకవి.

మఱియు శృంగారనైషధ ముందు—

క. జగము నుతింపఁగఁ జెప్పితి
పెగడయ్యకు నా యనుంగుఁ । బెద్దనకుఁ గృతుల్
నిగమార్థ సార సంగ్రహ
మగు నా యారాధ్యచరిత । మాదిగఁ బెక్కుల్.

పై పద్యమునుబట్టి యారాధ్యచరిత మొక్కటియే గాక మఱి కొన్ని గ్రంథములుకూడ ప్రెగడయ్యకే యంకిత మొనర్పఁ బడియుండె నని తేటతెల్ల మగుచున్నది. ఇప్పుడు నామమాత్రావశేషములై యున్న మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి కూడ ప్రెగడయ్యకే యంకిత మొనర్పఁబడి యుండెనో, లేక నామములైనను లోకమున కెఱుంగఁబడని మఱికొన్ని పుస్తకము లేమైన నున్నవేమో యెఱుంగఁదగు నాధారము లేమియుఁ గానరావు.

ఈతఁడు హరవిలాస మను నొక శైవప్రబంధముకూడ రచియించెను. దానినిగూడ కాశీఖండమునఁ బేర్కొనలేదు. అందుచే నీ గ్రంథము కాశీఖండమునకుఁ బిమ్మట రచియించి యుండెనేమో యని యనుమాన ముదయించుచున్నది. కొన్ని కారణములచేఁ గుమారగిరిరెడ్డి

బ్రతికియున్న కాలముననే దీనిని రచియించి యుండు నని కొందఱభి ప్రాయపడుచున్నారు.

మరుత్తరాట్చరిత్రము, శాలివాహన సప్తశతి, ఆరాధ్యచరిత్రము మున్నగునవి నామమాత్రావశేషములై యున్నవి. ఎచ్చటను లభించుటలేదు.

శివరాత్రిమాహాత్మ్య మను గ్రంథరాజ మిటీవలనే ప్రకటింపఁబడినది. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు నందిగామతాలూకాలో నున్న నీ గ్రంథమును సంగ్రహించి ముద్రింపించి యాంధ్రలోకమున కందఁజేసి యున్నారు. ఇయ్యది యీశానసంహిత నుండి యాంధ్రీకరింపఁబడినది. కొందఱీగ్రంథమే శ్రీనాథుని యంత్యకృతి యని యభిప్రాయ పడుచున్నారు. మఱికొందఱు భీమఖండమునకుఁ బూర్వము రచియించి యుండునని వాదించుచున్నారు

1 మరుత్తరాట్చరిత్ర.
2 శాలివాహన సప్తశతి.
3 శృంగార నైషధము.
4 హరవిలాసము.
5 భీమఖండము.
6 కాశీఖండము.
7 ఆరాధ్య చరిత్రము.
8 శివరాత్రి మహాత్మ్యము.
9 పల్నాటివీరచరిత్ర
10 రసికాభిరామము.
11 వీధినాటకము.

శ్రీనాథుడు నైషధమును రచించుటకు మున్ను మూఁడుపుస్తకములు రచియింపఁబడి యున్న వని చెప్పఁబడెను గాని యయ్యవి మనకు లభ్యము గాలేదు. రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగా రాంధ్రకవుల చరిత్రమునందు "రామకృష్ణకవిగారు సప్తశతిలోనిదని యొకపద్యము మాత్ర మిచ్చినారు దాని నీక్రింద నుదహరించుచున్నా" నని వ్రాసియున్నారు. ఆపద్య మిది.

ఉ. వారణసేయ దావగొనవా నవ । వారిజ మంకుఁ దేఁటి క్రొ
వ్వారుచునుంటి నీ వెఱుఁగ । హా ప్రియ హా తెఱగంటి కంటి కె
వ్వారికి గెంపు రాదె తగ । వా మగవారల దూఱు నీ విభుం
డారసి నీ నిజం బెఱుఁగు । నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ !

ఇంతియేగాని యీపుస్తకము మాత్ర మొక్కఁడను లభింపలేదు. లభించిన గ్రంథరాజములను జదివి పాఠకమహాశయులు తృప్తి వహించియే యుందురు గాన తక్కిన పుస్తకములఁ గూర్చి విమర్శించుట మాని యీతని కథ లుదహరించుచున్నాను.

# శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగభూపాలుని దర్శనమునకుఁ బోవుట.



ఈ కవిసార్వభౌముఁడు సర్వజ్ఞసింగభూపాలుని దర్శింపవలయు ననెడి పూర్ణాభిలాషముతో వేంకటగిరి కరిగెను. రాజాహ్వానము బడసి దర్బారులోనికిఁ బోవుచు నిట్లనుకొనియెను.

" ఈ భూపాలుఁ డనన్య సామాన్యుఁడు గాఁడు. భాషావిశారదుఁడు. ఈతని యాస్థానంబునఁ బలువురు కవీశ్వరు లున్నారు. ఇచ్చట నా మర్యాద యెట్లు నిలచునో యేమో యెఱుంగరాకుండ నున్నది." అని యనుకొనుచు మెల్లమెల్లగా నడచుచుండెను. అట్లు సందిగ్ధహృదయముతో నడచుచున్న యాతని కా సభామంటపంబున నున్న శారదాదేవి విగ్రహము దృగ్గోచర మయ్యెను శ్రీనాథుఁ డా దేవీమూర్తిం గాంచి భక్తిపరవశుండై యాశారద నీక్రిందివిధమున సంస్తుతించె నని పెద్దలు చెప్పుదురు.

సీ. దీనార టంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకు తోడై తాంధ్ర భాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తు ద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచు ఢక్క
చంద్రభూషక్రియా శక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద

గీ. మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ?



## సర్వజ్ఞసింగమనాయుని దర్శించుట



ఈ కవిసార్వభౌముఁడు రెడ్ల యాస్థానకవి. ఈతనిఁ గూర్చి యనేక కథలును, యితిహాసములును జెప్పఁబడుచున్నవి. వానిలోఁ గొన్నిటినిందుఁ బొందుపఱచుచున్నాను.

సర్వజ్ఞసింగమనాయుఁడు వేంకటగిరి సంస్థానాధిపతి. వీ రింటి పేరు వెలుగోటివారు. శ్రీనాథుఁ డీతనిని దర్శింపవలయు ననెడి కుతూహలముతో వేంకటగిరి కరిగి యొకానొక శుభదినంబున నాతని దర్శించి—

క. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే, రావు సింగ జనపాలునకే

యుర్విం జెల్లును, దక్కొరు
సర్వజ్ఞుం డనుట కుక్క । సామజ మనుటే.

తా. భూమిమీఁద సర్వజ్ఞుఁ డను బిరుదము శంకరునకును, సింగ భూపాలునకును మాత్రమే యొప్పును. తదితరులను సర్వజ్ఞు లనుట కుక్క నేనుగవంటి దని వాకొంచుట యగును.

రెడ్లకును వెల్గోటివారికినిఁ బరస్పర వైషమ్యము మెండుగాఁ గలదు. శ్రీనాథుఁడు రెడ్ల యాస్థానకవి గదా? తన శత్రుస్థానమున నుండి వచ్చిన కవిసార్వభౌముం డగు శ్రీనాథుఁడే తన్నిట్లు పొగడి నందుల కెంతయో సంతోషించి యా భూపాలుఁ డా కవిసత్తముని విశేషముగా బహూకరించెనఁట.

శ్రీనాథుఁ డా వసనముల నందుకొని తిరిగి తన స్వస్థానము నకుఁ బోయెను. శ్రీనాథుఁడు తమ వైరి యగు వెలుగోటి సింగమ నాయుని శంకరునితోఁ బోల్చి పొగడినట్లు విని యా రెడ్లాకవీంద్రుని పై నసూయ వహించి యాతఁ డరుదెంచఁగనే యాతనిని గాంచి యి ట్లనిరి.

"నీకు విశ్వాసము లేదు. న్యాయబుద్ధి లేదు. అందులకయ్యే పెద్దమ్మ మీ కవీశ్వరుల నెత్తిపై నెక్కి తాండవ మాడుచుండును. ఇంతకాలము నుండి నీవు మా సొమ్ము దినుచుంటివి. నీకు మా యెడల గౌరవభావ మున్నదా? ఉన్నచో నావైరి భూపాలుని నీ వట్లు స్తుతింపఁగలవా? నీ కిది తగునా?"

శ్రీనాథుఁ డా వాక్యము లాలించి చిఱునగవుతో ని ట్లనియెను. "అయ్యా! మీరు వృథాగా నన్ను నిందించుచున్నారు. చెప్పుడుమాటలను విని వాని నాధారముగాఁ గొని తమయట్టివారు నన్ను ద్వేషించుట భావ్యము గాదు. మీ రా పద్యమును జక్కఁగాఁ జదివి యందున్న నర్థము సమన్వయము జేసికొని నే నాతనిని బొగడితినో, నొవ్వ

నాటితినో గ్రహించి యప్పుడు మీ చిత్తము వచ్చినట్లు నన్ననుఁడు నేను చదివిన పద్యమిది.

కం. సర్వజ్ఞ నామధేయము, శర్వునకే, రావు సింగ జనపాలున కే
యుర్వింజెల్లును? దక్కొరు, సర్వజ్ఞుం డనుట కుక్క సామజమను టే.

తా. సర్వజ్ఞుఁ డను బిరుద మొక్క శంకరునకే చెల్లును. సింగ భూపాలునకు నే భూమిని యీ బిరుదు చెల్లును? శంకరుని గాక తక్కిన వారిని సర్వజ్ఞుఁ డనుట కుక్క నేనుఁగ యని వాదించుట గాదే?

భూతలపతీ! నా యభిప్రాయము మీ కవగతమైనదా? ప్రభువువారు నా యభిప్రాయ మెయ్యదియో గ్రహింపకుండ నిందించుట భావ్యము గాదు. తన వైరి నాకును వైరియే. అట్టి వైరిని బొగడుటకు నేను మందుఁడనా? మన వైరిని గొంచపఱుపవలయు ననునభిప్రాయముతో నే నటకుఁ బోయి యాతనిని గూర్చి యీ పద్యము నే చదివితిని. దానికి వారు మూర్ఖులు గాన సరియైన యభిప్రాయము దీసికొనక వికృతాభిప్రాయము దీసికొని నాకు బహుమాన మొసంగిరి. ఇదియే యందలి యాథార్థ్యము" అని శ్రీనాథుఁ డనెను.

శ్రీనాథుఁడు తన తప్పు నీ విధము దప్పుకొనెనని రెడ్డి గ్రహింపఁజాలక యాతని యుక్తివాదనల కలరి యాతనికి బహుమతు లర్పించి క్షమింప వేఁడుకొని రని యొక ప్రతీతి గలదు.

## సమస్య

"కుక్కవో నక్కవో ఫణివో క్రోఁతివో పిల్లివో భూతపిల్లివో."

శ్రీనాథుఁడు వేంకటగిరిసంస్థానమునం దున్న కాలముననే యాతని దర్శించి తన దరిద్రదేవతను బాఱఁదోలి భాగ్యవంతుఁడు గావలయునను నభిలాషముతో నొక భట్టు వచ్చి యాతని దర్శించి సింగ

మనాయునిచే సత్కరింపఁబడి యొకచో నాసీనుండై యిట్లనియెను.

"ప్రభువరా! నే నొక సమస్య గల్పించితిని. ఆ సమస్య నెందఱికో యొసంగితిని కాని నా యభిప్రాయమున కనుగుణ్యముగా నెవ్వరును బూరింపఁజాలకపోయిరి. మీ యాస్థానమునందు దిగ్గజముల వంటి కవీశ్వరు లున్నవారని విని యిక్కడకు వచ్చితిని. నా సమస్యను విని మీ కవీశ్వరులచే దానిని బూరింపఁజేయుఁడు. అని వేఁడి సమస్య నిట్లు చెప్పెను.

"కుక్కవో నక్కవో ఫణివొ క్రోఁతివొ పిల్లివొ భూతపిల్లివో"

సింగమభూపాలుఁ డాసమస్యఁ బూరింపుఁడని యాజ్ఞాపించెను! అచ్చటికవులందఱును దీర్ఘముగా నాలోచించిరి. వారికేమియు స్ఫురింప లేదు. ఎట్టకేలకు విన్నవదనంబులతోఁ దమ యసమర్థత్వ మా భూపతికి విన్నవించుకొనిరి. సింగమభూపాలుఁ డప్పటికి వారి నేమియు ననక శ్రీనాథునిం గాంచి యిట్లనియెను.

"అయ్యా! కవి సార్వభౌముఁడ వను బిరుదను బొందితివి. ఏదీ నీ వా సమస్యఁ బూరింపుము" అని యాజ్ఞాపించెను.

వెంటనే శ్రీనాథుఁడు తన యాసనముపై నుండి లేచి యీ సమస్య నీ క్రింది విధముగాఁ బూరించెను.

ఉ. తక్కక రావుసింగ వసు ॥ ధాధవుఁ డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కుల లేని కర్ణుల ద ॥ధీచిని ఖేచర వేల్పుమానుబొ
పెక్కన కామధేనువు శి ॥ బింబుని నెన్నెదు భట్ట దిట్టవై
కుక్కవో నక్కవో ఫణివొ ॥ క్రోఁతివొ పిల్లివొ భూతపిల్లివో.

తన యభిప్రాయ మిది కాదని యనినచో భూపాలునివలనఁ దన కేమి పరాభవము వాటిల్లునో యను భయంబు పెంపున తన యభిప్రాయ మయ్యదియే యని యప్పటి కాథట్టంగీకరించి చల్లచల్లగా దర్బారు విడచిపోయెను.

తన యాస్థానమర్యాద నిలువం బెట్టిన శ్రీనాథుని కా భూపతి విశేష బహుమానము లొసంగెను.



## డు, ము, వు, లు యితిహాసము.



శృంగార శ్రీనాథుని నైషధమును గూర్చి యీయితిహాస మొకటి చెప్పుదురు.

సంస్కృతనైషధమందలి శ్లోకములలోని దీర్ఘసమాసములకు విభక్తి ప్రత్యయములఁ జేర్చికొని తన నైషధమునందు వేసికొనెను.

"సువర్ణదండైక సితాతపత్రిత
జ్వలత్ప్రతాపావళి కీర్తిమండలః"

అను శ్లోకపాదమునకు:—

సీ. తపనీయ దండైక । ధవళాత పత్రితో
ద్దండ తేజఃకీర్తి । మండలుండు"

అని తెనిఁగించెను. ఇందు

సువర్ణమునకు=తపనీయ మనియు,
సిత=ధవళ,

అనియు గణ యతి ప్రాసానుకూలముగా మార్చి చివరనున్న "కీర్తిమండలః" యనుదానికి విభక్తిఁ జేర్చి "కీర్తిమండలుండు" అని చెప్పెను.

మఱియు,

"గమికర్మీ కృతనైకనీవృతః" అను పాదము.
"గమికర్మీ కృతనైకనీవృతుఁడనై"
అని చివర "డు" వర్ణము జేర్చివైచెను.

ఇట్లే,

"మందాక్ష మందాక్షర ముద్రముక్త్వా"

అను శ్లోకములోని పై పాదమును మార్పేమియుఁ జేయకుండఁగనే

"రమణి మందాక్ష మందాక్ష రంబుగాఁగ"

అని తెనిగించెను.

ఇటువంటి ప్రయోగములఁ గాంచి యాతని సమకాలికులగు పండితులు శ్రీనాథునితో "నీ డు, ము, వు, లు మా నైషధము మీఁదఁ బాఱవేయు" మని యెగతాళిగాఁ బల్కుచుండెడివా రనియొక కథ గలదు.

## బావమఱఁదులు



ఆంధ్ర మహాభాగవత గ్రంథ నిర్మాత యైన బమ్మెర పోతనామాత్యుండును శ్రీనాథుఁడును సమకాలికులు. వీరిరువురును "బావమఱఁదులు" అని పెద్దలు చెప్పుదురు. వారిని గూర్చి యిట్లు చెప్పుదురు.

పోతనామాత్యుఁడు చాల బీదవాఁడు. శ్రీనాథుఁడు గూడ నీ తరగతిలోనివాఁడే గాని పోతనవలె నోఁకమూలఁ గూర్చుని యుండక భూనాయకుల దర్శించి వారల నిచ్చవచ్చినట్లు పొగడియు, నరకృతుల నొసంగియు, భాగ్యవంతుఁ డయ్యెను. వెనుకటి యవస్థ మఱచిపోయెను. ఐశ్వర్యము స్థిరమనుకొని నమ్మెను. తనవలెనే నరకృతులొసంగి భాగ్యవంతుడవు గమ్మని తన బావమఱఁదిని బ్రోత్సహింపవలయు ననెడి కుతూహలముతో బయలుదేఱి, తనవైభవము బావమఱఁదికిఁ జూపి, యాతనిని భ్రమింపఁజేయవలయు ననెడి కుతూహలముతో మిగుల నట్టహాసముగాఁ దన దర్జాకుఁ దగిన పరివారగణముతో

నొక పాలకిపై బయలుదేఱెను. పోతనామాత్యున కైదాఱెకరముల భూమి మాత్రమే గలదు. ఈ భూమి గాక వేఱి జీవనోపాధి కింకెట్టి యాధారమును లేదు. పోతనగారి కుమారుని పేరు మల్లన. ఈభూమి నొకరికి కౌ లొసంగక తాము స్వయముగాఁ గష్టపడి పండించుకొని యా ఫలితమునే తినుచు సుఖముగా జీవించుచుండెడివారు.

పోతనయు, మల్లనయు, నానాఁ డాపొలమునం దున్నుచుండిరి. నాఁడే శ్రీనాథుఁడు పాలకీపైఁ బోతనను గేలిసేయవలయు నని వచ్చుచుండెను. తన బావమఱఁదియు, మేనల్లుఁడును బొలము దున్నుచుండఁగా శ్రీనాథుఁడు జూచి యిట్లనుకొనియెను.

"పాప మీతఁడు హాలికుఁడై యష్టకష్టంబులఁ బడుచున్నాఁడు. ఎట్టులయిన నీతనికి హితోపదేశ మొనర్చి యీతఁడు రచించిన "ఆంధ్ర మహాభాగవతము" యే మహారాజున కైనను గృతి నిచ్చుట కొడంబఱుపవలయును. ఈతఁ డెవ్వరికైనఁ గృతి నిచ్చినచో యీతని దారిద్ర్యము పటాపంచలై పోవును. నరకృతి యొసంగుట కంగీకరింపని వీని నొడంబఱుచుటయుఁ గష్టమే. నరకృతు లొసంగుచున్న నాకుఁగూడ శారదాదేవి దాసురా లని నా మాహాత్మ్య మీతని కెఱుకపఱచి పిమ్మట గృతి యొసంగుమని ప్రోత్సహించెదఁ గాక."

అని యనుకొని తన పల్లకీ మోయుచున్న బోయీలను బిలచి "ముందునండి మోయుచున్న బోయీలు దండి విడచి దూరముగాఁ బొండు" అని యాజ్ఞాపించెను. బోయీ లట్లే వెడలిపోయిరి. శారదాదేవి ప్రభావముచే బల్లకీ యథాప్రకారముగా నడచుచునే యుండెను. శ్రీనాథుఁడు తన బావమఱఁది వైపు సగర్వముగాఁ జూచుచుండెను. పోతనామాత్యుని కుమారుం డగు మల్లన యీ చిత్రముఁ జూచి తండ్రి కెఱింగించెను. పోతనయుఁ బాలకిలోనున్న శ్రీనాథునిఁ జూచి, తన ప్రభావము నాకుఁ జూపుటకై యిట్లొనర్చినాఁడని గ్రహించి తన

పరిభావముగూడ బావమఱఁది కెఱుఁగఁ జేయఁ దలంచి "కుమారా! దాపలియెద్దును విప్పివేయుము." అని యాజ్ఞాపించెను. మల్లన వెంటనే యెద్దును విప్పివైచెను. శ్రీనాథుని పాలకీ యెట్లు నడచుచున్నదియో, పోతనగారి నాగలి యట్లే నడుచుచున్నది. శ్రీనాథు డది గాంచి తన బావమఱఁదిగూడ పరిభావముగలవాఁడే యని గ్రహించియుఁ దనశక్తిసామర్థ్యంబు లింకను జూపింపవలయు ననెడి కుతూహలముతో రెండవవైపు మోయుచున్న బోయీలను గూడఁ దప్పుకొమ్మని యాజ్ఞాపించెను. వెంటనే బోయీలు పల్లకినివిడచి దూరముగాఁ బోయిరి.

యథాప్రకారముగా నిరుపార్శ్వములయందును గూడ బోయీలు మోయుచున్నప్పటివలెనే పాలకీ నడచిపోవుచుండెను.

మల్లన యీ విచిత్రమును జూచి యథారూపముగా వర్ణించి తండ్రికి కెఱింగించెను. పోతన కుమారుని వాక్యము లాలించి "అట్లైన నాగలికి రెండవప్రక్కనున్న యెద్దునుగూడ విప్పివేయుము." అని యాజ్ఞాపించెను.

వెంటనే మల్లన తండ్రి యాజ్ఞఁ బాలించెను. ఎద్దులు గట్టినప్పటికంటె విప్పి వేసినప్పుడే 'నాగలి' మిక్కిలి చురుకుగా భూమిని దున్నుకొనుచుఁ బోవుచుండెను.

శ్రీనాథుఁ డయ్యది గాంచి చకితుఁ డయ్యెను "శారదాదేవి యీతనికిగూడ దాసురాలై యున్నది. కావున నే నిట్టి కార్యములలో నీతనిని గెలువఁజాలను. ఈతనికడకరిగి మాటలలో గెలిచేసెదగాక" అని తలంచి తిన్నఁగాఁ బోతనగారిచెంతకుఁ బాలకిని బోనిచ్చి యందుండి దిగి బావమఱఁదిని గాంచి పరియాచకముగా "హాలికులకుఁ గుశలమా?" అని యడిగెను.

తన బావమఱఁది తన్నుఁ బరిహసించుట కూహించియున్నాఁడని తలంచి యాతని గర్వపరిహార మగునట్లుగా నిట్లుత్తరము నొసంగెను.

ఉ. బాల రసాల సాల నవ । పల్లవ కోమల కావ్యకన్యకన్
కూళల కిచ్చి యప్పడుపుఁ । గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి? గహ । నాంతరసీమల కందమూల కౌ
ద్దాలికులైన నేమి? నిజ । దార సుతోదర పోషణార్థమై.

ఇంతలో శ్రీనాథుని వాయి కట్టుపడిపోయినది. పాప మొక తుణికను వలెనను వంచిన తల నెత్తుకొనలేకపోయెను.

ఎట్టకేలకు శ్రీనాథుఁడు—

"బావా! వేడుకమాటల కలుక యెందులకు?" అని పోతనగారి క్రోధ ముడిపి యింటికి పోవుదము రమ్మని కోరెను. వెంటనే యందఱును గృహోన్ముఖులైరి.

శ్రీనాథుఁడు బాటమధ్య తన శక్తిసామర్థ్యములఁ గూర్చి విశేషముగాఁ బొగడుకొనుచు మధ్యమధ్య పోతనగారి లేమినిగూర్చి వగచినట్లును, వాతపెట్టినట్లును మాటలాడుచు కట్టకడపట నిట్లనియెను.

కం. కమ్మని గ్రంథం బొక్కటి
యిమ్మగ నే నృపతికైనఁ । గృతి నిచ్చినచోఁ
గొమ్మని యియ్యరె వెయ్యా
ర్లిమ్మహి దున్నంగ నేల? । యిట్టి మహాత్ముల్.

అని బోధించెను. పోతనగారతని వాక్యము లాలకించుచుండెనే గాని యెట్టి సమాధానమును నీయలేదు. ఇంతలో వారు వారి గృహమున కరుదెంచిరి.

## పోతనకు సరస్వతీదేవి ప్రత్యక్షమగుట.

పోతనయు, మల్లనయు, శ్రీనాథుఁడును మెల్ల మెల్లగా గృహంబున కరుదెంచుచుండిరి. తన యింట నాహారపదార్థము లేమియు లేవని

పోతన యెఱుంగును. అట్టియెడ మహావైభవముతోఁ జనుదెంచిన తన బావమఱఁది నెట్లు సత్కరింపఁగలనా యను దిగులుతో నేమియుఁ బాలుపోవక పోతన యెట్లో గృహంబున కరుదెంచెను.

శ్రీనాథుని, యతని వెంట వచ్చిన పరివారమును జావటిలోఁ గూర్చుండఁ బెట్టి పోతన లోని కరిగి కుమారునిఁ బిలచి యిట్లనియెను.

"కుమారా! నీవు వడివడిఁ బోయి వీరికెల్లరకును జాలు నాహారపదార్థము లిరుగుపొరుగువారి నడిగి యప్పు దీసికొనిరమ్ము."

తండ్రియాజ్ఞాప్రకారము మల్లన ప్రతిగృహంబునకును బోయి యడిగెను. ఒకటి రెండు మానికల బియ్యమైనచో నెవ్వరైన నప్పు నీయఁగలరు. ఏమియు లేని బీదవానికి, నూఱు నూటయేబదిమందికి సరిపోవు నాహారపదార్థము లెవ్వ రప్పుగా నీయఁగలరు? పాపము మల్లన ప్రయాసమంతయు వ్యర్థమైపోయెను. విన్నవదనంబుతో గృహంబున కరుదెంచి తండ్రి కావార్త నెఱిఁగించెను. ఆవార్త నాలించి పోతనామాత్యుఁ డెంతయో విచారించెను.

తన గృహంబున కరుదెంచిన తన బంధుగుల నాఁ డెట్లు తృప్తి పఱతునా యని విచారించుచుండెను. అట్లు విచారించి విచారించి చేయునది లేక తన కీవిషయంబునఁ బరాభవము రాకుండఁ గాపాడుమని తన కిలువేల్పగు సరస్వతీదేవిని బ్రార్థించెను.

భక్తజనసులభురాలగు నా భారతీదేవి యాతనికిఁ బ్రత్యక్షమై యాతని విచారకారణ మెఱింగి యిట్లనియెను.

"కుమారా! నేనుండ నీ వేటి కిట్లు విచారించెదవు? నీ ప్రతిష్ఠ కేమియు భంగము రాకుండఁ గాపాడెదను. నీవు వగవవలదు. నేను తక్కుంగల కార్యమ్ములన్నియుఁ జూచుకొందును. వారిని స్నానములు చేసి రమ్మనుము." అని చెప్పి యావాణి యంతర్ధానమయ్యెను.

హర్షహృదయుఁడై పోతనామాత్యుండు చావటిలోని కరిగి,

"బావా! ఆలస్యం బెందులకు? నీవు వేగముగా శిష్యులతో స్నాన మాచరించి రమ్ము. పెందలకడ భోజనము లొనరింతము." అనియెను.

శ్రీనాథుఁ డా వాక్యము లాలించి శిష్యులతోఁ దటాకమునకుఁ బోవుచు నిట్లనుకొనియెను.

"ఈతఁడు మిక్కిలి బీదవాఁడే! మమ్మందఱ నెట్లు సత్కరింపఁ గలఁడు? మమ్మందఱ సత్కరించుపాటి శక్తిసామర్థ్యంబులే యున్న యెడల నీతఁడు హాలికుఁడై యుండు టేమికర్మము? ఇం దేదియో చిత్రి ముండును."

అందఱును గృతస్నాతులై తిరిగి పోతనగారి గృహంబున కరు దెంచిరి. వీ రందఱును వచ్చునప్పటికి వాకిట విస్తళ్ళు వేయఁబడియుం డెను. అందఱును గూర్చుండిరి.

అతరువాతఁ బోతనామాత్యుండు తన సోదరిని బిలచినట్లు "అక్కా! తడవేల? వడ్డింపుము." అనియెను.

వెంటనే భారతి యొక స్త్రీరూపముఁ దాల్చి పంచభక్ష్యపర మాన్నంబులును దెచ్చి వడ్డించెను. వా రందఱును దృప్తిగా భోజన మొనర్చి పోతనగారి యైశ్వర్యమున కెంతయూ నలరిరి.

భోజనానంతరమునఁ దాంబూలముల స్వీకరించు సమయంబున శ్రీనాథుఁడు తన బావతో నిట్లనియెను.

"బావా! నీవఖండ శేముషీవిశారదుండవు. కవిశ్రేష్ఠుండవు. నిన్ను మీఁఁచిన కవీశ్వరులుగాని, నీతో సమానులగు కవులుగానియిప్పుడు లేరు. ఇట్టివాఁడవయ్యును నీ విట్లు దరిద్ర మనుభవింపనేల? ప్రపంచముపై నీయట్టి కవీశ్వరుఁ డెట్లు లేఁడో, నీయట్టిదరిద్రుఁడుగూడ నట్లే లేఁడు. ఈ దరిద్రదేవిని బాఱఁదోలుకొనుట నీ చేతిలో నున్నది. నీవురచించిన భాగవతము నేరాజునకైనఁ గృతి నిచ్చితివేని నీ కేనుఁమూడుపురుషాం

తరములవఱకును నిలచిపోవు నైశ్వర్యము వచ్చును. నా మాట వినుము. పరలోకసౌఖ్యముల కాసించి యిహలోకసౌఖ్యములను జెంద నాడుకొనకుము. పరలోకసౌఖ్యము లెవ్వఁడు చూచెను. నీవేమియుఁ బ్రయత్నము చేయనక్కఱలేదు. సమస్తమును నెఱవేర్చెదను. నే నేరాజేంద్రునకైన నొప్పించెదను. వానికి నీవు కృతి నిమ్ము." అని యనేకవిధముల పోతనామాత్యున కుపదేశించెను.

మన పోతనామాత్యుం డామాట లాలించి కొంచెము సందిగ్ధ హృదయముతో నాలోచింప మొదలుపెట్టెను. పోతన యట్లే యింకను నాలోచించుచుండఁగా శ్రీనాథుఁడు మరల నందుకొని—

"బావా! నీ విం దాలోచింపవలసిన యగత్యము లేదు. నీ వింతకుముందు పొలములో జరిగిన చిత్రచరిత్రఁ జూచియే యున్నావు. నేననేక సత్కృతు లొసంగితిని అయినను వాగ్దేవి నన్నుఁ దన ప్రియ కుమారునిగా భావించుకొని నా కెప్పుడు కానవలెనసిన నప్పుడే ప్రత్యక్షమగుచున్నది. సత్కృతు లొసంగినంతమాత్రమున నీపై హాటక గర్భురాణి కాగ్రహము వచ్చునేమో యని యనుకొనకుము. నాకుఁ బ్రత్యక్షమైనయట్లే యామె నీకును బ్రత్యక్షమగుచుండును. విశేషించి నీవు భాగ్యవంతుఁడ వయ్యెదవు. కావున నీ వాలోచింపవలసిన పని లేదు. అట్లే కృతి నొసంగెద నని నీ వనుము. ఎల్లుండి సాయంత్రము నకు నిన్నైశ్వర్యవంతునిగా నొనరించెదను. కాళ్ళకడ్డకు వచ్చిన భాగ్యదేవతను దన్ని పొమ్మనకుము. నా మాట వినుము."

పోతనగా రా వాక్యము లాలించి యేమిచేయుదమా? అని దీర్ఘముగా నాలోచించుచుండెను.

అట్లాలోచించుచున్న పోతన్నగారికి వాణి ప్రత్యక్షమై కన్నీటి కాలువలు వెల్లువలై పాఱుచుండ వలవల నేడ్చుచు "నన్నుఁ బరుల

కమ్మి యా ధనముతోనా నీవు జీవింపఁదలంచుట?" అని దీనముగా నడుగుచున్నట్లు కన్పడెను.

అట్లు ప్రత్యక్షంబైన శారదాదేవిని జూచి పోతన్నగారు తన దురభిప్రాయమును మార్చుకొని, చేతులు జోడించి వినమ్రభావముతో

ఉ. కాటుకకంటినీరు చను । కట్టుపయిం బడ నేల యేడ్చెదో?
కైటభదైత్యమర్దనుని । గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను । నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల । కమ్మ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!

అని చెప్పెను. పోతనగారి వాగ్దత్తమున కలరి సరస్వతి యంతర్ధానమైపోయెను. అప్పుడు పోతనగారు "బావా! అశాశ్వతమగు ధనమున కాశించి కీర్తికాంత నమ్ముకొనఁజాలను. భారతి నాయిలు వేల్పు. అమెను నేను విక్రయింపను. నన్ను మన్నింపుము," అని సమాధాన మిచ్చెనఁట.

---

## యుక్తి సమాధానము



శ్రీనాథుఁడు పోతనామాత్యవిరచితం బగు భాగవతముఁ గొని యా తాళపత్రిసంపుటములోఁ గొన్నికొన్ని భాగములఁ జదివి చదివి క్రమక్రమముగా నష్టమస్కంధమందలి గజేంద్రమోక్షణకథాప్రసంగంబున గజరాజు రక్షించుటకై విష్ణుమూర్తి వైకుంఠము నిర్గమించుసందర్భంబునఁ జెప్పఁబడిన—

మ. సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం । జేదోయి సంధింపఁడే
పరివారంబునుఁ జీరఁ డభ్రగపతిం । బన్నింప డాకర్ణికాం
తరధమ్మిల్లము జక్కనొత్తడు వివా । దప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజ । ప్రాణావనోత్సాహి యై.

అని యున్న పద్యమును జదివి పోతనామాత్యుఁ బిలిచి పరి యాచకముగా నిట్లనియెను.

"ఏమోయి బావా! ఈపద్య మి ట్లసందర్భముగా వ్రాసితి వేమి? గజేంద్రుని రక్షించుటకై పోవునట్టి శ్రీమహావిష్ణువు చక్రమై నను బట్టుకొనకుండఁ బోయెనని వ్రాసితి విది యసభ్యముగా లేదా? ఆయుధము లేకుండ మొసలి నెట్లు చంపుదనుకొంటివి. కరిరాజు నెట్లు విడిపించు ననుకొంటివి. మన చిత్తమువచ్చినట్లు గ్రంథములు రచింప వచ్చు ననుకొంటివా? దీని కేమి సమాధాన మిత్తు" వని యడిగెను. పోతరాజుగా రప్పటి కేమియుఁ బ్రత్యుత్తర మీయ కూరకొనిరి.

ఇది యైన కొన్నిదినముల కొకనాఁడు శ్రీనాథుఁడు భోజన మొనరించుచుండెను అప్పుడే పోతనగారు పొలములోనుండి గృహం బున కరుదెంచిరి. పోతనగారు వచ్చునప్పటికి శ్రీనాథుని కుమారుఁడు వీధిలో నాడుకొనుచుండెను. వెంటనే పోతనగా రా కుఱ్ఱవానిని బారు గింట దాచి బిరబిర పెరటిలోని కరిగి యొక పెద్దబండను నూత వైచి కంపితకంఠస్వరముతో—

"బావా! బావా!! నీకుమారుఁడు కాలుజారి నూతిలోఁ బడి పోయినాఁడు రమ్ము రమ్ము" అని కేకలు వైచెను.

భోజన మొనరించుచున్న శ్రీనాథుఁ డా వాక్యము లాలించి యాత్రముతోఁ జేయియైనను గడుగుకొనకుండ బిరబిర నూతివద్ద కరిగి "అయ్యో! అయ్యో!! ఎక్కడెక్కడ?" అని నూతిచుట్టును గిరగిర తిరుగ నారంభించెను. అప్పుడు పోతనగా రాతనిని జూచి యిట్లనియెను.

"ఏమోయి బావా! నూతిలో దిగుటకు నిచ్చెన లేకుండ, నూ తిలో దిగువారు లేకుండఁ, బైకి బాలుని దీయుటకు త్రాడు లేకుండ మొగిలిచేతితో వచ్చితి వేమి? నూతిచుట్టు ప్రదక్షిణము జేయుటవలన నీ కుమారుఁడు పైకి వచ్చునా? నీ విక్కడి కేమిచేయువలయునని వచ్చి

తివి? ఉపకరణములు లేకుండ నేమిచేయవలయునని నీ యభిమతము" అని యడిగెను.

"కన్నకుమారుఁడు నూతిపాలై పోవుచుండెనని వినుటతోడనే మతి చలించిపోయినది. అందుచే నాలోచనావిహీనుండనై చక్కవచ్చితిని. బావా! నా పుత్రుని దీయింపవా?" అని యడిగెను.

"బావా! శ్రీమహావిష్ణువు గజమునురక్షించుటకు వెడలినపద్యమును జూచి యాక్షేపించితివి జ్ఞాపక మున్నదా? నీకు నీ కుమారుఁ డెట్టివాఁడో పరమేశ్వరునకు భక్తుఁడును నట్టివాఁడే. అంతకంటెసహస్ర విషయములం దెక్కువ. నీవు నీ కుమారుని రక్షించుకొనుట కొంగిలి చేతితో, విడివడిన జుట్టుతో, నిచ్చెన లేక, త్రాళ్ళు లేక, నూతిలో దిగువారు లేక పిచ్చి యెత్తినవానివలె వచ్చి నూతిచుట్టును బ్రదక్షిణము చేయవచ్చును గాని, భక్తపరాధీనుం డగు నప్పరమేశ్వరుఁడు తన భక్తుని మొఱవిని నేను జెప్పినట్లుగాఁ బోవు టసంభవమైనదా? ఆహాహా! ఏమి నీ విమర్శనాజ్ఞానము. తప్పు సవరించుట యనిన నిట్లుండవలయును. పరమేశ్వరుఁడే రక్షింపనున్నప్పుడు చక్రము లేకున్న నడ్డువా! నీ కొమరుని రక్షించుట కుపకరణము లుండితీరవలయును. పరమేశ్వరుఁడు తన భక్తులను రక్షింపఁదలఁచుకొనినప్పు డాతని కుపకరణము లగత్యము లేదు. ఆతని సంకల్పమాత్రంబుననే భక్తుఁడు రక్షింపఁబడుచున్నాఁడు. మొన్న నీ వడిగిన ప్రశ్న కీవిధముగా సమాధానముఁ జెప్పదలంచి యీ యుక్తిఁ బన్నితిని గాని నీ కుమారుఁడు క్షేమముగానే యున్నాఁడు. రమ్ము చూపెదను." అని లోనికిఁ దోడ్కొనిపోయెనఁట.

# కర్ణాటరాజ్యము



శ్రీనాథకవిసార్వభౌముఁడు దేశాటన మొనరించుచు ననేక దేశాధీశ్వరులం దర్శించి వారిచే సత్కరింపఁబడుచు నెట్టకేలకు కర్ణాట రాజ్యరాజధానిని జేరెను. ఆతని కాయూర రాజదర్శనము సామాన్యముగా లభించినది గాదు.

ఈ కర్ణాటరాజు దర్బారునం దనేకమంది పండితులు గలరు. వీరందఱును స్వార్థలాభపరాయణులు. తమకంటె గొప్పపండితుఁ డెవ్వఁడేని వచ్చినచోఁ దమ కా యాస్థానంబున నిలువనీడమైనను లభింపదేమో యని వారికి విశేషముగా భయము గలదు. అందుచేఁ బరదేశములనుండి రాజదర్శనలాలసులై చనుదెంచిన పండితుల కా భూనాథుని దర్శనలాభము గలుగకుండఁ జేసి, తమ తెల్వితేటలకుఁ దామే సంతోషించుచుండెడివారు. ఇట్లుండ నీయంశ మెఱుంగక శ్రీనాథుఁడా గోముఖవ్యాఘ్రముల నాశ్రయించెను. ఇదివఱకువోలె వీరినిఁగూడ సాగనంపనెంచి వారెల్లరును శ్రీనాథుని శక్తిసామర్థ్యంబులఁ గనిపెట్టుటకై చిన్నచిన్న సమస్య లొసంగిరి. వీరి కుటిలవర్తన మెఱుంగక యా సమస్యలు పూరించుటలోఁ దన శక్తిసామర్థ్యంబు లెల్లఁ జూపించినచోఁ బండితులెల్ల సంతోషించి తనకు రాజదర్శనము చేయింతురనెడి పూర్ణవిశ్వాసంబుతో వా రొసంగిన సమస్య లెల్ల నత్యద్భుతముగాఁ బూరించెను.

అసూయాపిశాచపీడితులగు నా పండితులెల్ల రెట్టివానినిఁగూర్చి భయపడుచుండిరో యట్టివాఁడే యరుదెంచెను. అట్టివానిని జూచినపుడా పండితుల కెట్లుండునో యించు కూహింపుము.

"అయ్యా! నీవు నిశ్చయముగాఁ గవిసార్వభౌముఁడ వనఁదగినవాఁడవు. నీయట్టివానిని మే మెన్నఁడును జూచి యెఱుంగము. నీ కెట్టి

నను రెండుమూఁడుదినములలో భూపతి దర్శన మబ్బునట్లొనరించెదము" అని యప్పటికి వానిని సంతోషపఱిచిరి.

పాపము శ్రీనాథుఁడు వారి మాటలను నమ్మి యట్లే నిరీక్షించి యుండెను.

గడువు గడచినది. మఱి వార మైనది! తుట్టతుదకు నెల యైనది. పండితు లెప్పటికప్పుడు రేపు రే పనుచుండిరి. శ్రీనాథునకుఁ బ్రాణము విసివిపోవుచున్నది. కాని యేమిచేయఁగలఁడు? పండితుల నేమనఁ గలఁడు ?

శ్రీనాథుఁడు—

"మనసు నొవ్వకుండ । మనపని సైకుండ
కార్యసిద్ధి నెపుడుఁ । గాంచవలయు"

అను సూత్రప్రకారము నడచుకొనువాఁడగుటచేఁ బండితుల నేమియు ననక కార్యసిద్ధి కెదురుచూచుచుండెను.

క్రియ కెన్నిదినములైనను బండితులవలన మన శ్రీనాథున కించు కంతయును నుపకారము జరుగలేదు.

ఇట్టి సమయమున నాతఁ డొక నాఁడు.

శా. కుళ్ళాయుంచితిఁ గోకచుట్టితి మహాకూర్పాసముం దొడ్డితిన్
వెల్లుల్లిం దిలపిష్టముం మెసవితిన్ । విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లాయంబలి ద్రావితిన్ రుచుల దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్.

అని ప్రార్థించెనఁట.

తరువాత పరమేశ్వరదయవలన నా పండితుల సహాయ మక్కఱలేకుండఁగనే రాజదర్శన మొనరించి యాతనిచే బహూకరింపఁబడియె నని పెద్దలు చెప్పుదురు.

---

# మంచినీళ్ళకై శ్రీనాథుని మొఱ్ఱ



శ్రీనాథుఁడు పల్లెనాటిసీమను జూడవలయు ననుకుతూహలముతోఁ బోవుచుండెను

ఆ పల్లెనాటిసీమయం దెచ్చటను కాల్వలుగాని, తటాకములు గాని లేవు. నూతులుమాత్ర మున్నవి. కాని యానూతులైనను సామాన్యుల కందుబాటులో నున్నవి గావు. నలుగురైదుగురు రెండుమూడు గంటలు ప్రయత్నించి తోడినచో రెండుమూడు శేర్ల నీళ్ళు బయటికి వచ్చును. నూతిలోనుండి తొంగిచూచినచో నీ ళ్ళెక్కడనున్నవో కనఁబడవు. ప్రపంచముమీఁద కొండవీటి చేదత్రాళ్ళే మిగులఁ బ్రసిద్ధి కెక్కినవి. అట్టి ప్రసిద్ధికెక్కిన చేదత్రాళ్ళైదాఱు గలసినగాని పల్లెనాటి సీమలోని నూతి క్రిందిమట్టమును జూడఁ జాలవు.

ఇట్టి యపురూపంబగు సహారాయెడారిలోఁ బ్రయాణముఁ జేయుచున్న శ్రీనాథున కొకనాఁడు విపరీతముగా దాహ మైనదఁట. ఆతని కెక్కడను మంచినీళ్ళు లభింపలేదు. పాప మేమిచేయఁగలఁడు. అంతకంత కాయాస మెక్కుడైపోవుచున్నది మంచినీళ్ళుమాత్రము దొరకలేదు. అందుచే నాతఁడొక బావిచెంత కరిగెను అప్పటికే యా నూతినుండి నీరములఁ దోడుటకై రెండుమూడుగంటలనుండి ప్రయత్నించుచుండిరి. ఈతఁడు వారిని సమీపించి మంచితీర్థ మడిగెను. వారును నింకొక గంట యాగుమని చెప్పిరఁట. అప్పు డాతఁడా నూతిచెంగట చదికిలంబడి యిట్లు మొఱ్ఱపెట్టెనఁట.

క. సిరి గలవానికిఁ జెల్లును
తరుణులఁ బదియాఱువేలఁ । దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దఱాండ్రా
పరమేశా! గంగ విడుపు । పార్వతి చాలున్.

తా. ఓ శంకరా! ధనము గలవానికి (అనఁగా లక్ష్మీదేవి వశ్యుఁడైనవానికి అనఁగా విష్ణువునకు అనుట) పదియాఱువేల తరుణులఁ బెండ్లాడుట సహజము. వారి నందఱను నతఁడు హాయిగాఁ బోషింపఁగలఁడు. నీవో పునిషిపుఱ్ఱెతో బిచ్చమెత్తుకొనునట్టి భిక్షుకుఁడవు. నీ పొట్టకే నీవు తెచ్చుకొనలేని యవస్థలో నీ కిరువురు భార్యలెందుకు? పురుషునకు భార్య తప్పదు గావున నీవు పార్వతిని నీకడ నుంచుకొని గంగాదేవిని మాకు విడిచిపెట్టుము.

తరువాత నూతిలోనుండి వచ్చిన నీరముఁ గ్రోలి యాతఁడు యథేచ్ఛం బనియెనఁట. ఇట్లు పెద్దలు చెప్పుదురు.

---

## పురోహితుని గృహము.

ఎట్టకేలకు శ్రీనాథుఁడా పల్లెనాటిసీమలోఁ గల యొక గ్రామపురోహితుఁ జూడఁబోయెను.

పాప మా పురోహితుఁ డంత నాగరికుఁడు గాఁడు. ధనవంతుఁడు గాఁడు. ఆ పురోహితుని యిల్లు మిగుల చిన్నది. ఆ యిల్లు వారికే చాల నిఱుకుగా నుండెను. ఆ గృహములో ననేక పశువులఁ గట్టివైచిరి. అందుచే గృహమంతయుఁ బశువుల పేడమూత్రాదులచే నిండియుండెను. దానికితోడు ఎక్కడఁజూచిన నక్కడనే దూడలవలెనే బాలురుకూడ పాడుజేసిరి. ఈ దూడలను గట్టిన స్థలమున కొకటిరెండు గజముల దూరములోననే పురోహితుని మంచ మున్నది. ఆ చుట్టుపట్లనే నానాదుర్వాసన లిచ్చు పదార్థంబులును గలవు. వీరు బీదవారు గావున నాగరికస్థలంబునకుఁ దీసికొనిపోయి యమ్ముకొనుటకై కట్టియుంచుకొనిన విస్తరాకులదిండ్లు చాల గలవు. వాని సమీపముననే వంటకట్టియలు. వీని యన్నిటికిని తోడా యింట నైదాఱుగురు పూర్వసువాసినులును గలరు.

శ్రీనాథుఁ డెప్పుడును రాజమందిరములలో దిరుగుచుండెడి వాఁడగుటచే పురోహితుని గృహము జూచి యాశ్చర్యపడిపోయెను. ఆతఁ డిట్టికొంప లెన్నఁడును జూచి యుండలేదు గాఁబోలును. పాపము బీదవా రేమిచేయుదురు. కల దానితో గడుపుకొనుట వారి కర్తవ్యము గదా యని శ్రీనాథుఁడు తలంపక యా విచిత్రముల నెల్లఁ గూర్చి బరిహాసముగా నిట్లు జెప్పెనఁట.

ఉ. దోసెడుకొంపలో పసుల । త్రొక్కిడి మంచము దూడరేణమున్
బాసిన వంటకంబు పసి । బాలుర శౌచము విస్తరాకులున్
మాసిన గుడ్డలున్ దలకు । మాసిన ముండలు వంటకుండలున్
రాసెడు కట్టెలుం దలఁప । రాదు పురోహితు లింటికృత్యముల్.

భాగ్యవంతులు గానివారి భాగధేయములింత కెక్కుడెట్లుండును?

ఆ. వె. చిన్నచిన్న రాళ్ళు । చిల్లర దేవళ్ళు
నాగు వేటినీళ్ళు । నాపరాళ్ళు
సజ్జ జొన్నకూళ్ళు । సర్పంబులును దేళ్ళు
పల్లెనాటిసీమ । పల్లెటూళ్ళు.

కం. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు । జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగఁ బల్నాటిసీమ । ప్రజ లందఱకున్.

## పల్నాటిసీమపై నిరసన.

పల్నాటిసీమలో చాల లోతుగాఁ ద్రవ్వినగాని యరగిద్దెడు మంచితీర్థమైనను లభింపదు. అంత లోతుగాఁ ద్రవ్వినచో మూఁడు నాలుగువేల రూప్యములు వెచ్చింపవలసి వచ్చును. ఒకానొకవేళ నే

పుణ్యాత్ముఁడైన వ్యయప్రయాసల కోర్చికొన్నిచోట్ల నూతులు త్రవ్వించినను, త్రవ్వినకొలంది రాయి వచ్చునుగాని యుద్ధరించుటకు నీళ్ళు లభింపవు. అట్లు నీళ్ళు లభింపక ప్రాణము విసివి సగము త్రవ్వించి విడచిన నూతు లనేకము గలవు. దీనికి పాఠకమహాశయులు చింతపడ నగత్యము లేదు. పల్నాటిసీమలోఁ గొన్నికొన్ని నూతులలోని నీళ్ళు చేదుటకు గాను దీసికొనిపోవు చేదత్రాఁడొక్కఁడు మోయలేక యిరువురుగలసి తరువు వేసికొని పోయెదరఁట. ఆహాహా! పల్నాటిసీమ వారికిగల మంచి నీళ్ళ సదుపాయము వర్ణనాతీతముగదా! సరియైన నీటి యాధారము లేమిచే నీ పల్నాటి సీమయందు పల్లపుపంట లేమియుఁ బండవు. విత్తనములు రద్దు పోగా పోగా, పరమేశ్వరానుగ్రహమున నెప్పుడైన సకాలములో వర్షించినచో నాయేఁడు విరుగబండును. కాని యేమి లాభము? ఎంతపంట పండినను [illegible] రద్దుపోయిన దానికంటె తక్కువే. ఇంక మెట్టపంటలగు జొన్న, సజ్జ, రాగులు మొదలగు పంటలేగాని తదితరములగు పంటలేమియుఁ గానరావు. పై కారణమునఁ బల్నాటిసీమలో దుకాణములు గూడ తక్కువే.

పల్నాటిసీమ ప్రజ లించుక మోటువారు. అందున స్త్రీ లంద వికారముగా నుందురు. సరియైన నీటివసతి లేమిచే శృంగారరసంబు లీను నుద్యానవనంబులు గూడ గానరావు. వా రంతగా శుచి, శుభ్రము లెఱింగినవారు గారు. ఈ విషయములన్నియు గుఱించి శ్రీనాథుఁ డీక్రింది పద్యము జెప్పెను.

ఉ. అంగడి యూర లేదు వరి । యన్నము లేదు శుచిత్వమేమి లే
దంగన లింపు లేదు ప్రియ । మైన వనంబులు లేవు నీటికై
భంగపడంగ బాల్పడు కృ । పావరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్నగాన పల । నాటికి మాటికి బోవనేటికిన్.

తాత్పర్యము సుగమ్యము గాన వ్రాయలేదు.

# బచ్చలిశాకము, జొన్నకూడు.



శ్రీనాథుఁడా పల్నాటిసీమలో సంచారముజేయుచు నొకరి యింట నొకానొక దినంబున భోజనమున కుండి పోయెను.

పల్నాటిసీమలో నెక్కడనో గాని భాగ్యవంతులు లేరు ఈతఁడు భోజనమున కున్న గృహస్థుఁడు సామాన్య సంసారిగాని భాగ్యవంతుఁడుగాఁడు. వారికి ధాన్యముగాని మంచిమంచి కూరలుగాని లభ్యమగుట కాధారములేదు.

ఇట్టి తరుణంబున నొక పండితుఁడు తమయింటికి భోజనమునకు వచ్చుటచే నాగృహస్థునెక్కడెక్కడికో తిరిగితిరిగి, కొంచెము బచ్చలికూర సంపాదించెను. అదియైనను చాలినంత దొరకినదిగాదు. అందుచే నింకొక తలంబునకుఁబోయి కొంత చింతచిగురు సంపాదించి రెండును గలిపి పులుసు చేయుమనియాజ్ఞాపించెను. జొన్నన్నము సిద్ధమైనది. దానిలోని కాధారము చింతచిగురు, బచ్చలికలిపినపులుసు వంటలైనవి. అందఱును భోజనములకుఁ గూర్చుండిరి. వడ్డించుటకు విశేషమగు పదార్థము లేమియున్నవి. అన్నము పులుసు వడ్డనలైనవి శ్రీనాథుఁడు విస్తరివైపు జూచెను. గుండె గుభిల్లుమనియె.

పాపము శ్రీనాథుఁడు సుకుమారముగా బ్రదికినవాఁడు గాని లేకిబ్రతుకు బ్రదికినవాఁడు గాఁడు. కావున నా బచ్చలిపులుసును జొన్నకూడును దినఁజాలక గుటకలు వైచుచు గోడకుఁ జేరఁగిలఁబడి యీక్రిందిపద్యమును జెప్పెనఁట.

ఉ. ఫుల్లసరోజనేత్రి! యల | పూతన చన్నుల చేఁదుద్రావి నా
డల్లదవాగ్ని మ్రింగితి న | టంచును నిక్కడ వేల? తింత్రిణీ
పల్లవయుక్తమై యుడుకు | బచ్చలిశాకము జొన్నకూటితో
మెల్లన నొక్కముద్ద దిగ | మ్రింగుము నీపస గాననయ్యెడిన్.

తా. ఓ మహానుభావా! కృష్ణమూర్తీ!! నీ పసితనంబున నిన్నుఁ జంపవలయునని చన్నులకు విషము పూసికొని నీకుఁ బాలీయ వచ్చిన పూతనను జంపితివనియు, బడబానలమువోలె నున్న దవాగ్నిని మ్రింగి గోపికాస్త్రీలను రక్షించితివనియు నాయంతవాఁ డీ ధరాతలం బున లేఁడని మిట్టిపడిసి రాలిపడి పోయెద వెందుకు? నీవిదవఱకొనర్చిన కార్యము లంత యాశ్చర్యజనకములు గావు. నీ శక్తి సామర్థ్యంబులు లోకమునకు వెల్లడింపఁ దలంచుకొంటివేని యిప్పుడు గృహ యజమానురాలు సిద్ధముచేసిన యుడుకు బచ్చలికూర పులుసు నీ జొన్నన్నముతోఁ గలిపి యన్నమంతయు వల దొక్క ముద్ద మ్రింగుము. నీ సామర్థ్యము లోకములకు వెల్లడియగును. అని చెప్పెనఁట.

## వారనారి

ఈ కవిసార్వభౌముఁ డొక ధరారమణుని జూడఁదలంచి పోయెను. అచ్చటనుండి యా భూపతి గుణరత్నాదులఁ గూర్చి తెలిసికొనవలయునని ప్రయత్నించెను. ఆ వసుంధరారమణుఁ డనవరతము వారనారీలోలుఁడై తాను వారికొఱకే యుద్భవించితిననియుఁ దన కొఱకె వారనారుల నా పరమేశ్వరుండు సృష్టించెననియు దలంచి యొక్కక్షణంబైనను వృథా బోనీయక సంతతము వారలచెంతనే యుండుచు, విశేషముగా వారల నాదరించుచు వారికే కానుక లొసంగుచుఁ బ్రపంచమునే మఱచి యాతఁ డుండెను.

నారీపిశాచ మావహించిన వానికి మతియే యుండదు. అందున వారనారీపిశాచ మావహించినచో నింకఁ జెప్పవలసిన దేమున్నది?

వారనారీ లోలుఁడై తక్కిన కార్యముల పొంతఁబోకుండెను. కవులన్నను, గాయకులన్నను మండిపడిపోవును గాని దర్శనంబైన నొసంగఁడు.

ఈ సంగతులన్నియు శ్రీనాథుఁడు విని యిట్లు చెప్పెనఁట.

మ. కవితల్ జెప్పిన పాడ నేర్చిన వృథా । కష్టంబె యీ భోగపుం
జవరాండ్రే గద భాగ్యశాలినులు పుం । స్త్వంబేల పోఁగాల్పరా?
సవరంగా సొగసిచ్చి మేల్ యువతి వే । షంబిచ్చి పుట్టింతువే
యెవరుం మెచ్చి ధనంబు లిచ్చెదరుగా । దే పాపపుం దైవమా!

తా. ఓ మతిలేని బ్రహ్మదేవుఁడా! కవిత్వము జెప్పినను సంగీతము నేర్చినను వృథా కష్టమై పోవుచున్నది గాని యెవ్వరును నొక్క రాగిపైస నైన నీయకుండిరి ఇంక మా కీ పురుషత్వము లెందుకు? మాకు తగిన యందమిచ్చి మమ్మఁగూడ వారనారులగా సృష్టించి యుందువేని ప్రతివారును మా పాదములచేత ధనరాసులు గుమ్మరించుచుందురుగదా? మా కట్టి భాగ్యము లేకుండ జేసితివి. నీ వింత పక్షపాత హృదయుండ వైతివేమి?

---

## కారెమపూఁడి.

పల్నాటిసీమకు శ్రీనాథుఁ డనవరతము పోవుచుండెడివాఁడు గాఁబోలును. ఆ సీమపై నీతని కెంత యనాదరణం బున్నదో చదువరుల కీవఱకే తెలిసియుండును. పలనాటిసీమపై యాతనికున్న యభిప్రాయ మాతఁడు పెక్కు పద్యములలో స్పష్టీకరించియున్నాఁడు. పల్నాటిసీమపై నీతని కెంత నిరాదరణ భావమున్నదో యంతకు వేయిరెట్లెక్కువ నీతని కా పల్నాటిసీమలోనే పనియున్నది ఈతఁ డెందు కొఱకో యొకంతకొఱ కా పల్నాటిసీమ కరుగుచునే యుండెడివాఁడు.

ఈ పల్నాటిసీమలో కెల్ల "పట్టణము" అని కొంచెము కీర్తి గాంచినది కారెమపూఁడి యొక్కటియే. ఈసీమ కంతకును వసించుట కనువగు స్థలం బియ్యదియే. ఆతఁ డీ కారెమపూఁడి నీ విధముగా వర్ణించి యున్నాఁడు.

ఉ. వీరులు దివ్యలింగములు ♦ విష్ణువు చెన్నుఁడు కల్లిపోతురా
జారయ కాలభైరవుఁడు ♦ యంకమశక్తియె యన్నపూర్ణయౌ
గేరెడు గంగధార మడుఁ ♦ గే మణికర్ణిక గాఁ జెలంగు నీ
కారెమపూడి పట్టణము ♦ కాశిగదా పలనాటి సీమకున్.

ఈ కారెమపూడి వాస్తవ్యులకీ గ్రామమున కన్న (అనగా వెలసిన) దేవుళే యిలువేల్పుల.

మన ప్రాంతములవారికి కాశికానగర మెట్టిదో యీ పల్నాటి సీమప్రాంత వాస్తవ్యులకెల్ల నీ కారెమపూడి యట్టిదని శ్రీనాథుఁడు వర్ణించుచు—

వీరులు = అక్కడక్కడ వెలసిన వరుసగాను లింగములవంటి చిన్నచిన్న విగ్రహములు.

వీరులు = ఇవియే లింగములు.

చెన్నుఁడు = విష్ణువు = చెన్నుడు = అచ్చటనున్న దేవుని పేరు.

కల్లిపోతురాజు = కాలభైరవుఁడు.

అంకమ అనే పేరుగల గ్రామదేవతయే కాశికానగరములోని యన్నపూర్ణగాఁ జెప్పియున్నాఁడు.

గంగాధరమడుగు = ఇదియే వారికి మణికర్ణికాఘట్టము.

ఆహాహా! పల్నాటివారి వైభవము.

కం. రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁగంగా రంభయైన ♦ నేకుల వడుకున్
వసుధేశుఁడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్న ♦ కూడే మెసవున్.

తా. రసికుఁడైనవాఁ డెన్నటికిని పల్నాటిసీమకుఁ బోఁడు. ఎందుచేత ననఁగా రంభ కంటె సుకుమారియగు దానైనను సరియే యేకులు వడుకును భూమీశ్వరుఁడైనను సరియే భూమి దున్నును.

మన్మథుఁ డైనను సరియే జొన్నన్నము దినవలసినదే. ఇట్టి కష్టతరం బగు పల్నాటిసీమకు నవరస రసికశిఖావతంసముం డెందుకుపోవును ?

శ్రీనాథుఁడు, నేతకులు వడుకుట, భూమి దున్నుట అనాగరిక కృత్యము లని తలంచియుండెను. ఇట్లే చాలమంది తలపోయుటచే వస్త్రములకై నితరులపై యాధారపడుట, మన భూమి మనము దున్ని పండించుకొనలేక పరులకు కౌలు నిచ్చి మనము బానిసత్వమునకు సిద్ధపడుట జరుగుచున్నది.

మన భూమి కౌలు తీసికొనినవాఁడు మన మక్తా మన కిచ్చి, దొరతనమువారికి బన్ను లిచ్చి మిగిలినదానితో సంవత్సరము పొడుగునను సుఖముగా జీవించుచున్నాఁడు. మనభూమి మనమే దున్నికొన్న యెడల మన కీబానిసత్వముపై నాధార మేలయుండును?

ఎవరికి సరిపడు వస్త్రములకు వారే నూలు వడుకుకొనుట తటస్థించినచో మనము పరభృతులమై యుండవలసినపని లేదుగదా? ఆ లాభము మనకే యుండునుగదా? మనదేశ మైశ్వర్యముతో దులతూఁగు చుండునుగదా?

నేతకులు వడుకుట, భూమి దున్నుట, తప్పుగాఁ బరిగణింపఁ బడు చున్నంతకాలము మన కీయవస్థ తప్పదు.

నేతలే మన మానమును గాపాడును. నాగలియే మన ప్రాణములను నిలువం బెట్టును పాఠకమహాశయులారా! ఈవిషయమును మఱువకుఁడు.

---

# భృంగపంచకము

కవిసార్వభౌముం డగు శ్రీనాథుఁడు భృంగపంచక మనుపేరనైద పద్యములు రచించి యుండెను. ఆ పద్యముల భావము ననుస

రించి యొక చక్కని గాథఁ బెద్దలు చెప్పుచుందురు. ఆ కథ నిచ్చట పొందుపఱచుచున్నాను.

ఒకానొక మండలాధిపుని పట్టమహిషి బహు రూపసియఁట. ఆతని ప్రధానామాత్యుండు గూడ నవమన్మథునిఁ దిరస్కరించు సోయగము గలవాఁడఁట. ఈ పట్టమహిషి పుట్టినింటివారిచే నొక దాసి వరణముగాఁ బడసెను. దానిపేరు చతురిక. ఈమె పేరునకుఁ దగిన ప్రజ్ఞావంతురాలు. తన దాసియొక్క చతురత్వము తనకు బూర్ణముగాఁ దెలిసినదే కావున నొకానొక దినంబున తనదాసిని బిలచి—

“చతురికా! నీవు నా చెలికత్తియ వైనందుల కెంతయు గర్వించుచున్నాను. నీవు చాల వివేకవంతురాలవు. నీయట్టివారే మాయట్టివారికి పెట్టినది భిక్ష. ప్రధానామాత్యుని జూచిననాఁటినుండియు నా మనము మనమునం దుండుటలేదు. కంటికి నిదుర లేదు. నా కాహారము రుచించుటలేదు. నన్ను నీవు రక్షింపవలయును. నీ కంటె సమర్థు లింకెవ్వరును లేరు. నీవు తలఁచుకొంటివేని నిమిషములో నన్నాతనితోఁ గూర్పఁగలవు. నా కోరిక చెల్లించుము.” అని యనేకవిధంబుల నా దాసిని బ్రతిమాలినదఁట.

దాసియు నామె మాటల కుబ్బినది. తప్పక నీకోర్కె నీడేర్తు నని వాగ్దాన మొసంగినది. నాఁడే ప్రధానామాత్యునిఁ దీసికొనివచ్చి యంతఃపురములో విడచినది.

దేవి కిం కేమికావలయును? ఆమె ప్రధానామాత్యునిఁ జూచుకొని ప్రపంచమునే మఱచిపోయినది. అట్లయిన ప్రధానామాత్యుం డెట్లుండెను?

ప్రధానామాత్యుఁడా? పట్టమహిషి కౌఁగిలిలోఁ జిక్కి యానందరసాంబుధిలోఁ దేలియాడుచుఁ దన్నుఁ దానే మఱచియుండెను.

ఇంతలోఁ బ్రొద్దుగ్రుంకుసమయ మాసన్న మైనది. కాలాతీతమైన దనిగాని, సూర్యాస్తమయమైన దనిగాని వారు గమనింపనే లేదు.

ఎట్లో మంత్రిగారే చీఁకటి పడఁబోవుచున్న దని కనిపెట్టి వెడలి పోవుటకుఁ బ్రయత్నించెను. కాని రాణి విడచిపెట్టలేదు. అతఁడు వెడలి పోవలయు నని ప్రయత్నించుచున్నకొలఁదియు రాణి కౌఁగిలిని బిగించుచుండెను. ఇం కాతఁ డా బిగికౌఁగిలినుండి యెట్లు తప్పించుకొని పోవఁగలఁడు?

తరువాత రాణి యాతనిపైఁగల నభిమానంబు పెంపున భూనాథుండు తనకుఁ గానుకగా నొసంగిన పచ్చలహార మాతని కిచ్చి యాతనిని గొసరికొసరి ముద్దు లిడుకొనుచుండెను.

ఇంతలో భూకాంతుఁ డంతఃపురంబునకు వచ్చుచుండెను. ద్వారము చెంతనున్న చతురిక ధరారమణుఁ జూచినది. కలవర పడినది. రాణి కావార్త నెఱుఁగఁ జేయవలయు ననిన రాజు చాల సమీపమునకు వచ్చెను. ఇంక నవ్యాపదేశముగాఁ జెప్పుట కంటె గత్యంతరము లేదు. అయినను చతురిక భయపడక యా యంతఃపురంబునకు మిక్కిలి సమీపములో నున్న నుద్యానవనములోని తటాకమువైపుఁ జూచుచు,

ఉ. మాయురె భృంగమా! వికచ । మల్లికలన్ విడనాడి తమ్మిలో
నీ యెడఁబూవుఁ దేనియల । నింపు జనింపఁగఁ గ్రోలి సౌఖ్యమున్
బోయెద నన్న భ్రాంతి నిఁకఁ । బొందకు రా జదియుంచె నిప్పుడే
తోయజ పత్రముల్ వరుస । తో ముకుళించెఁ జలింపకుండుమా!

మంత్రివైపున వచ్చునర్థము:—ఓ ప్రధానశేఖరా! నీ భార్యను విడనాడి యీమొత్తలో సౌఖ్యంబులం బొందవలయునని చనుదెంచిన వాఁడవు. కార్యానంతరమునఁ బోవ కిటు కాలవిలంబన మొనరించితివి. రా జరుదెంచుచున్నాఁడు అయినను భయము లేదు. దాఁగియుండుము.

ఈ హెచ్చరికను రాణి విని చిటికలో మంత్రిని దాచివైచి రాజు రాక కెదురుచూచుచుండెను.

రాజీ చతురిక చదివిన పద్యమును వినియుండెను. రాజు చతురికను సమీపించి యేమని యడిగెను. అప్పు డది యిట్లు చెప్పెను.

"ధరారమణా! ఏమున్నది నేనొక్క యరఘడియ నుండి చూచుచుంటిని. అదిగో! తమరుగూడఁ బరీక్షింపుఁడు. ఆ యుద్యానవనములో నున్న పూలపై తుమ్మెదలు వ్రాలి యందున్న మధువును గ్రోలి యంతతోఁ దృప్తి వహింపలేక తామరపూవులోని తేనె మిక్కిలి రుచ్యముగా నుండు ననెడి పేరాసతో సూర్యాస్తమయమగుచుండుటఁ గూడ గణింపకా తుమ్మెద లాపూవులపై వ్రాలి మకరందము నొడలు తెలియకుండఁ గ్రోలుచున్నవి. ఇంతలోఁ జంద్రుఁ డుదయించుటచేఁ దామరపూవులు ముడుచుకొనిపోయినవి. పాపము. మధుపానాసక్తితోఁ బోయిన భృంగ మాపద్మమున నీ విధముగా బందీకృతమై పోయినది.

ఈ విచిత్రవర్తన మంతయుఁ జూచి మాకేమియు భయములేదు. జాగ్రత్తగా నందే యుండుమని దానిని హెచ్చరించుచున్నాను."

అని దాసి చెప్పఁగా రాజా వాక్యములు విని దాని తెలివితేటల కలరి తిన్నగా నంతఃపురములోనికిఁ బోయెను.

పాప మీ ప్రధానామాత్యుండు దాఁగియున్న యంతరు వంత మంచిదికాదు. గాలి యేమాత్రంబునుగూడ నాగదిలోనికి రాదు. చాల కష్టముగా నుండెను. పద్మముకు శాంతరమందున మిక్కిలి బాధతోఁ బైకి రాఁగోరి మార్గము గానరాక వెతఁజెంది యిటు నటుఁ బొరలాడు మత్తమధుకరము వోలె మంత్రి యిటు నటుఁ గదలుచుండెను. చతురిక యీ సడ గనిపెట్టినది. చతురిక కనిపెట్టినట్లే రాజుకూడ పసికట్టినచో నింక నేమైన నున్నదా? కొంప మునిఁగిపోదా?

ఎట్లయిన నాతనికి ధైర్యము గొలుపవలయునని తలంచి యప్పు డన్యాపదేశముగా నీ క్రిందిపద్యము జదివినది.

చ. అళికులవర్య! పద్మముకు । ళాంతరమందు వసింపనేరమిన్
జలనము సెందెదేమి ? నవ । సారస మిత్రుఁడు రాకయుండునా ?
తొలఁగక యుండెయుండు మిఁక । తోయజవైరి తీరదొ? రాత్రియా
కలవగమొం ? తమ్మి తుదఁ । గానక తూలక యూరకుండుమా ?

మంత్రివైపునవచ్చు నర్థము:—ఓ ప్రధానశేఖరా! నీ వారహస్య మందిరమున నిలువఁజాలక మిక్కిలి బాధపడుచున్నావు కాని యోర్చుకొనక తప్పదు. ఓర్చుకొని చప్పుడు చేయకుండ నుండుము. కష్టము లెల్లకాలము నుండవు. ఈ రాజెక్కడ స్థిరముగాను. నీవు పైకిఁ బోవుట కెంతయో కాలము లేదు. ఈలోపున గడబిడచేయక యూరకే యణఁగి మణఁగి యుండుము.

తుమ్మెదవైపు వచ్చునర్థము:—ఓ తుమ్మెదా! ముడుచుకొనిపోయిన తామరపువ్వునందుండనేరక యల్లాడిపో చేసెద. వేమిలాభము? ఈ రాత్రి స్థిరమా? ఈ చంద్రుఁడు స్థిరమా? నీమిత్రుఁ డుదయింపకుండ నుండునా? నీకష్టములు తొలఁగకుండ నుండునా? మఱేమియు భయములేదు కంగారు పడకుము. సమయము మనదగు వఱకును నోర్చియుండుము.

రహస్యాగారము నందున్న ప్రధానుఁ డా హితవాక్యముల నాలించి కొంచెము ధైర్యముతో నా కష్టములను సహించి యోర్చుకొనుచుండెను.

ఇంతలో నీ ప్రధానుని యర్ధాంగి తన భర్త యెంతకును దిరిగి గృహంబునకు రానికారణంబున నామె భర్తసంగతి తెలిసికొనవల యునని బయలుదేఱెను.

ఈమెకు తన భర్తవృత్తాంతము బూర్ణముగాఁ దెలియదు. కావున యీమె తిన్నగాఁ జతురికను జూడవలయు ననెడి యభిలాష ముతో వచ్చుచుండెను. రహస్య మంతయుఁ దెలిసి చతురికకైనను

నామె కెఱింగింపలేదు. పాప మెట్లెఱిగింపఁ గలదు? ఆమెను వచ్చి వెలగకాయ గొంతునకుపడి నట్లైనది. రాణికిఁగాని, మంత్రికిఁగాని ప్రాణాపాయము రాకుండఁ గాపాడు భార మీమె నెత్తిపై నున్నది? అట్టి యెడ వీరి నిట్టి సందిగ్ధావస్థలో విడచి యెట్లు మంత్రిభార్యచెంత కరుగఁ గలదు? ఆతని క్షేమ మామె కెట్లెఱిగింపఁ గలదు? సర్వ మెఱిగిన చతురిక యీవిషయ మేయాంశంబున నెఱిఁగింప నప్పు డామె మన మెట్లూరట వహింపఁ గలదు? అంతలోనే యామె యిక్కడకే వచ్చెను. ఆమెను చతురిక జూచి యన్యాపదేశముగా—

మ. అలినీ! తత్తరమేల? నేఁడు విదె నీ ౹ యాత్మేశుఁడౌ భృంగముల్
జలజాసక్త మరంద పానవశతన్ ౹ పానాతుఁడై యున్నవాఁ
డులు కింతేనియు లేక నీ వరుగుమీ ౹ యొప్పారు నిప్పాట నీ
చెలువుం డుబ్బఱతెంచు వేకువను రా ౹ జీవంబు పుష్పించినన్.

మంత్రిభార్యవైపున వచ్చునర్థము:—అమ్మా! నీభర్త యీ రాణివలన సకలసౌఖ్యంబులం బొంది యామె యధరామృతముఁ గ్రోలి హాయిగా సుఖంబుగా నున్నాడు. మఱేమియు భయములేదు. నీవు పొమ్ము. సూర్యోదయము కాఁగానే నీభర్త నీయింటికి కరుదెంచును.

తుమ్మెద వైపు వచ్చునర్థము:—ఓ ఆఁడు తుమ్మెదా! నీహృదయేశ్వరుఁడైన మగతుమ్మెద తామర పద్మములోని మకరందముఁ గ్రోలి మత్తెక్కి యొడలు తెలియకుండ నిద్రించినది. మఱేమియు భయము లేదు. నీవు నీ స్వస్థానమునకుఁ బొమ్ము. సూర్యోదయము కాఁగానే తిరిగి తామరపువ్వు వికసించును. అప్పుడు నీ హృదయేశ్వరుఁడు తిరిగి నీ చెంత కరుదెంచును. భయములేదు. తిరిగిపొమ్ము.

మంత్రిభార్య యీ వాక్యము లాలించి తన పతి క్షేమముగా నున్నవార్తఁ గర్ణపేయముగా విని బ్రహ్మానందభరితురాలై తిరిగి యింటికి పోయినది.

తదనంతరమున రాజు స్మరక్రీడావిలాసంబులఁ దేలియాడి యలసి సొలసి నిద్రించెను. రాణి కూడ పాప మధికాయాసముతో నిద్రించినది మన చతురిక యీ సంగతి గుర్తెఱింగి మంత్రితో నీ విలయంబున కతిరయంబునఁ బొమ్మని హెచ్చరించుచు నిట్లు చెప్పినది.

మ. పతి నిద్రించిన వేళ రాఁ దగునయో । పద్మాక్షి యీ కేళికా
యంతనంబునకు రతిశ్రీను స్వభుఁడు ని । ద్రాసక్తుఁడై యుండె నీ
శతపత్రేక్షణ మోహ మాంచినది నీ । సామర్థ్యము జూపఁగా
నతివేగంబుగ నేఁగుమా తొలఁగి మా । యాత్మల్ సుఖంబందఁగన్.

ఈ వాక్యంబు లాలించి యా విటాగ్రేసరుఁడు 'బ్రతుకు జీవుఁడా' యని సంతసమ్మదంబుతో గృహంబున కరిగెను.

రేయెల్ల నిద్రలేక పోయినను, త్వరితగతి దర్బారున కరుగవలసిన మహత్కార్యము లుండుటచేత, వెంటనే ప్రధానామాత్యుండు కోటకుఁ బోవుచుండెను.

ప్రధానామాత్యుని గళమునం దింకను పచ్చలహారము నాఱసి పోవుచుండెను. పాప మఱపిడితో దానిమాటయే మఱచిపోయెను. అయ్యో! ఎంతవిషమావస్థ వచ్చినది. ఈ పచ్చలహారము తన భార్యపైఁగల మిక్కుటమగు మోహముచే రాజేంద్రుం డిచ్చియుండెను. ఆమె మోహోన్మాదముతో ప్రధానామాత్యుని కంఠమునందు వైచెను. రాజకార్యముల తొందరలో [illegible] మంత్రి దర్బారునకుఁ బోవుచుండెను. ఇట్టి సమయంబున నా పచ్చలహార మా నిండుదర్బారులో భూపతి జూచినచో కొంప మునిఁగి పోదా? చతురిక పరిశ్రమయంతయు నిష్ఫలమైపోదా? ఎన్నివిధముల బొంకినను రాణి తప్పించుకొనుట కవకాశముగలదా? వీరికీ యాపద యెట్లు గడచునో యేమో యెవ్వ రెఱుంగుదురు? దైవనిర్ణయ మెట్లున్నదో?

రాణి తన శయనాగారము న్వీడచి గది వెలుపలకు వచ్చి తన మేడపై నిలువంబడి యిటునటుఁ జూచుచుండెను. ఇట్లు చూచుచున్న యామెకు మేడలోని పచ్చలహారముతో రాజదర్బారున కరుగుచున్న ప్రధానామాత్యుఁడు గాన్పించెను. అప్పుడీ రాణి పైప్రాణములు పై కెగసిపోయెను. వెంటనే తడఁబడునట్టి పదములతోఁ జతురిక చెంత కరిగి కంపితస్వరముతో—

"చతురికా! సమయము తప్పివచ్చినది. ఇదివఱకుఁ గాపాడినది కాపాడుటగాదు. నన్నీ యాపదనుండి యిప్పుడు రక్షించుట రక్షించుట యగును. నా ప్రాణములు నిలువంబెట్టుము. నా మర్యాద గాపాడుము. ఆ మంత్రిపుంగవునిపైఁ గల యభిమానంబు పెంపున సందేహింపకుండఁగ నాకు రాజిచ్చిన పచ్చలహార మాతనికి బహుమానంబుగా నిచ్చివైచితిని. అతఁడాహార మింటియొద్ద భద్రపఱచుట మఱచిపోయి రాజకార్యముల యెడఁ గల తొందఱచే త్రోవనే సభాస్థలి కరుగుచున్నాఁడు. ఇంకేమున్నది. ఆ నిండుసభలో రాజేంద్రుఁ డాహారమును గుర్తించినచో మా యిరువురి ప్రాణములను గూడ నకాలమృత్యుదేవి కాహారము గావలసివచ్చును. నీవు నా తల్లివంటిదానవు. నన్ను రక్షింపుము. ఇదివఱ కెట్టి చాతుర్యముఁ జూపి నా కోరికలెల్ల దీర్చి నన్ను సంతోషపెట్టితివో యట్లే నేఁడుఁగూడ నీ చాకచక్యమంతయుఁ జూపి నీ చతురత్వము బయటపడున ట్లేదేని యొక యుక్తిఁ బన్ని నా మర్యాద నిలువంబెట్టుము. నేను నలువురి నోళ్ళలోను బడకుండ, నా మూలమున నొక కుటుంబ మధోగతిపాలు గాకుండ గాపాడి పుణ్యము గట్టుకొమ్ము. తల్లీ! రక్షింపుము. రక్షింపుము."

అని అనేక విధంబుల నామెను బ్రతిమాలినది. చతురికయు దేవి నోదార్చి "తల్లీ! నేనుండ నీ కేటిభయము. నీ ప్రాణములకు నా ప్రాణ మడ్డువైచి నిన్ను రక్షించెదను. ఏ కారణమున నిష్కారణ

నా మంత్రికుటుంబ మధ్యగలిపాలు గాకుండఁ గాపాడెదను. మఱేమియు భయములేదు. చింత దక్కుము సుము" అని రాణి కనేకవిధంబుల ధైర్యముఁ జెప్పి చతురిక యింటికిఁ బోయెను.

రాజదర్బారంతయుఁ గిటకిటలాడుచుండెను. మంత్రి సామంతాదిభృత్యులతో రాజేంద్రుండు గొలువు దీర్చి యుండెను. అమాత్యుని కంఠమునందున్న బచ్చలహార మా సభాభవనమున కంతకును శోభఁ గూర్చుచుండెను ఇంకను దర్బారు కార్యములు ప్రారంభింపఁ బడలేదు. రాజేంద్రుఁడా పచ్చలహారమును జూడలేదు.

ఇంతలో నొక భట్టుమూర్తి వినయస మా సభాస్థలంబునకు విచ్చేసి సభ నంతయు గలయఁజూచి మిక్కిలి వినమ్రభావముతోఁ జేతులు మోడ్చి —

చ. అతుల సభాంతరస్థిత బు । ధావళి కెల్ల జోహారు, వీరరా
హుతులకు మేల్జొహారు సత । తోజ్జ్వల విక్రమ సార్వభౌమ సం
తతికి జోహారు వైభవవి । తానపురందరుఁడైన యట్టి భూ
పతికి జోహారు మానపరి । పాల జొహారు ప్రధానశేఖరా !

తా. సభాస్థలంబున నాసీనులైయున్న పండితుల కెల్లరకును జోహారు. ఇచటనున్న వీరాధివీరు లెల్లను మఱిమఱి జోహారు. సార్వభౌముని సంతతి కంతటికిని జోహారు ఇంద్రునితోఁ దుల్యమగు వైభవముగల రాజేంద్రునకు జోహారు. మానపరిపాలనమే ప్రధాన కర్తవ్యముగాఁ గల ప్రధాన శేఖరునకు జోహారు.

ఈ భట్టుమూర్తి చదివిన పద్యమున కందఱును సంతుష్టహృదయులైరి. ఆతని నందఱును బొగడిరి.

“అందఱను సామాన్యముగా సంబోధించి నన్నొక్కనిని మాత్రము ‘మానపరిపాల’ యని యీ భట్టుమూర్తి సంబోధించుట కేమికారణము. ఊరక పాద పూరణమునకొఱకు వాడినపదమా ?

ఇందేమైన విశేషార్థమున్నదియా?" అని యాలోచించుచు సప్రయత్నముగాఁ దన వక్షస్థలముఁ దడవుకొనియెను. ఆ వజ్రపుహార మాతని చేతికిఁ దగిలినది.

వెంటనే యాతఁడు సంగతినంతయు గ్రహించెను యాకుహనా భట్టు రాణి చెలికత్తెయగు చతురికయే యనియు, మెడలోనిహారమును జూచి మన్మథోపహతయైనదని నవ్వేశములో నీహారమును బట్టుకొనిపోవుటకై యిట్లు వచ్చినదనియు గ్రహించి వెంటనే యాహార మాతఁడు ధరించిన యంగరఖాలో నుండిపోవ నట్లతిచమత్కృతిగా నంగరఖాను దీసివైచి దాని నాభట్టునకు దానమొసంగెను. రాజేంద్రుఁడును నాభట్టుమూర్తికి విశేషముగా బహుమానము లొసంగెను. భట్టుమూర్తి యావసనములఁ గొని రాజుకడ సెలవు దీసికొని వెడలిపోవుచు మేడపైకిఁ జూచి పరిహాసము తప్పిపోయినదని తెల్పుటకొక్క చిఱునవ్వునవ్వి వెడలిపోయెను. చతురికయొక్క చతురత్వముచే నీరహస్యం బెవ్వియు రాజేంద్రుఁ డెఱుంగనేలేదు. ఇట్లా దాసియొక్క సహాయమున వారిరువు రనవరతము గామక్రీడలఁ దేలుచుండెడివారఁట. ఆహాహా! కవిపుంగవులైన నెంతెంతవారు కారు?

---

## తాళఫలప్రమాణము



కవిసార్వభౌముఁడగు మన శ్రీనాథుఁడు పరిహాసప్రియుఁడు ఇసుమంత యవకాశ మొదవెనేని ప్రతివారిని బరిహాసించుట కలవాటు పడినవాఁడు. శ్వానపుఁదోఁకను బట్టియాకర్షించుచుండ నుండఁగలఁడా? ఈతఁడు పరిహాసప్రియుఁడని తెలియఁజేయుటకీయితిహాసములు ప్రబలనిదర్శనములుగా నున్నవి.

V Suryanarayana Reddy



రామయమంత్రి యను నాతఁ డీతనికి బావమఱఁదియఁట ఆతఁ డొక యూరికరణము. మంచి భోజనపుష్టి గలవాఁడు పాడిపంటలు మిక్కుటముగా గలిగిన సంసారి. ఆతఁడు మంచిభాగ్యశాలి. కొంత కాలమున కీతఁడు పరమపదించిపోయెను. ఒకనాఁ డీ రామయమంత్రిఁ గూర్చి యాతనికడ ప్రసంగము రాఁగా నా రామయమంత్రిఁ గూర్చి శ్రీనాథుఁ డిట్లనియెనఁట.

ఉ. గ్రామము చేతనుండి పరి । కల్పితధాన్యము నింటనుండి శ్రీ
రామకటాక్షవీక్షణ ప । రంపర చేఁ గడతేరెగాని మా
రామయమంత్రి భోజన ప । రాక్రమ మేమని జెప్పవచ్చు నా
స్వామి యెఱుంగు తత్కబళ । చాతురి తాళఫలప్రమాణముల్.

అని పరిహాసకముగాఁ జెప్పియుండెనఁట. ఇంకొకబంధుజుని పై నింకొకమాఱిట్లు చెప్పియుండెనఁట.

ఉ. మా కలిదిండి కామయకు । మారకుఁ డన్నిటఁ దండ్రిపైఖరే
కాక తదన్యుఁ డెట్లగును? । గాడిదకున్ దురగంబు పుట్టునే?
జేకొని కొంకినక్కకును । సింగము పుట్టునె? మాలకాకికిన్
గోకిల పుట్టునే? చిలుక । కుక్కకు మత్తగజంబు పుట్టునే?
అని పరిహాసకముగా దెవసి పెద్దలు చెప్పుదురు.

## కస్తూరిభిక్ష



శ్రీనాథకవిసార్వభౌముఁడు కర్ణాటదేశాధీశ్వరుండగు సాంపరాయనియొద్ద కరిగి యాతఁడు నిండుకొలువున్న సమయంబున నాతని దర్శించి యాతని నిట్లాశీర్వదించెను.

శా. ధాటీపోటకరత్నఘట్టనమిళ । ద్ద్రాఘిష్ఠకల్యాణ ఘం
టాటంకార విలుంఠలుంఠిత మహో । న్మత్తాహితక్షోణిభృ

తో^{ }టీరాంకిత కుంభినీదరనము । తూ^{ }టాటపీ^{ }ఘాంట క
ర్ణాటాంధ్రాధిప సాంవరాయని । తెనుంగా నీక బ్రహ్మాయువా.

ఇట్లాశీర్వదించిన యా కవిసార్వభౌముని యా భూపతి విశేష ముగా నాదరించెనట. ఆభూపు డొనర్చిన సత్కారంబుల కా కవి సార్వభౌముఁడు విశేషంబుగా నలరియుఁ గస్తూరి నిమ్మని కవిశ్రేష్ఠుం డీక్రింది పద్యమునఁ గోరెనట

శా. అక్షయ్యంబుగ సాంపరాయనికి తేజ । గాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరా । డ్బృందారకశ్రేణికిం
దాక్షారామచళుక్య భీమవరగం । ధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై । వాసించుఁ దద్వాసనల్.

అప్పుడా భూపతి యా కవిసత్తమునకు వలసినంత కస్తూరి దానముగా నొసంగెనట.

## బొడ్డుపల్లి

తనబావమఱదిని "హాలికులకు క్షేమమా?" అని యాక్షే పించిన మన శ్రీనాథకవిసార్వభౌముఁడు దేశాటనముఁ జాలించి బొడ్డు పల్లెను సేద్యము జేసికొనుచుఁ గాలముగడపుచుండెను.

బొడ్డుపల్లి కృష్ణాజిల్లాలోనిది ఇది కృష్ణానది కత్యంత సామీ ప్యములో నున్నది. కొంచెమించుమించుగా యొడ్డునఁ నున్నదనియే చెప్ప వచ్చును.

హాలికులని యాక్షేపించినపుడితని కేమియు గష్టములుగ లేదుగాని యాపనియే యీతని నెత్తిపైఁ బడినప్పుడు కష్టనష్టంబులకును లోనయ్యెననుటలో నతిశయోక్తి నొంతమాత్రమును లేదు.

ఈతని దురదృష్టమువలన నా సంవత్సరమున కృష్ణానది పొంగి

పైరుల నెల్లఁ బాడుచేసి వైచినది. పంటపోయినను పన్నుమాత్రము తప్పదు.

తన సంపాదనమునం దార్జించిన విత్తమంతయు విచ్చలవిడిగా నిర్లక్ష్యముగా వెచ్చించి వైచుటచే నప్పటికొంతనము వారికి పన్నిచ్చుకొనుటకుఁ దగినశక్తిసామర్థ్యంబు లేకునికి మిగుల విచారించుచుఁ జేయునది లేక యీక్రింది విధముగాఁ దన దుఃఖమును వెళ్ళఁబోసికొనెనఁట.

సీ. కవిరాజు కంఠంబు । కౌఁగిలించెను గదా
పురవీధి నెదురెండ । పొగడదండ
ఆంధ్రనైషధకర్త । యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెను గదా? । నిగళయుగము
వీరభద్రారెడ్డి । విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా? । వెదురుగొడియ
సార్వభౌముని భుజా । స్తంభమెక్కెను గదా?
నగరు వాకిటినుండు । నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె । నింత ఫలము
బిలబిలాక్షులు దినిపోయె । దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి । మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు । లేడునూర్లు.

## మసరరాజ్యము



ఈతని కీరాజ్యముపై గల నభిప్రాయ మీ క్రింది విధముగా వెల్లడి చేసియున్నాఁడు.

ఉ. గొంగడి మేలు పచ్చడము । కుంపటి నల్లులు కుక్కిమంచముల్
జెంగట వాయు తైలముల । జీర్ణపు మందులు నల్లిపాయలున్

ముంగిట వంట కట్టియల । మోపులు దోమలు పేఱపోతులుం
రంగ! వివేకి కీమసర । రాజ్యము కాపుర మెంతఘోరరా?

ఉ. వంకర పాగలుం గనుము । వంగిన కత్తులు మైల కోకలుం
సంకటి ముద్దలుం జరుప । శాకములుం బలు పచ్చడంబులుం
బొంకగు నోరమూపులును । దేకువ దప్పిన యేసబాసలుం
అంకుల బ్రహ్మ యీ మసన । రాజ్యము నెట్లు సృజించె నక్కటా!

ఉ. ఆదరణంబు సున్న విన । యంబు హితంబును బొంకు సత్యమా
లేను దయారసం బది హుళు । శిక్క పసాపను వేళ పత్త్రికలో
భేదపు పెట్టు దిట్టు బలి । భిక్షము.............................త
త్త్వములఁ బుట్టఁ జేసిన వి । ధాత ప్రజాపతి గాఁకయుండునే.

---

## గురజాల సీమ.

గురజాల సీమలో గల "పులిపాడు" అను గ్రామమునకు మన శ్రీనాథమహాకవి వెడలఁగా నాతనిఁ గాంచి నచ్చట శేషయ్య యను కరణమును, హనుమయ్య యను కాపును, పుల్లయ్య యను రెడ్డియును ననాదరముఁ జూపిరట దాని కాతఁ డలిగి చెప్పిన పద్యము.

ఆ. ఊరు వ్యాఘ్రనగర । మురగంబు కరణంబు
కాపు కపి వరుండు । కసవు మేయు
గంపుఁగొంక సిచట । గురజాల సీమలో
నోగు తెల్లఁ గూడి । రొక్కచోట.

---

## వేముని వర్ణన.

ఈ కవిసార్వభౌముఁడు తొలుత కొండవీటిరెడ్ల యాస్థాన కవి. ఆ రాజ్య మంతరించిన తరువాత నీతఁడు రాజమహేంద్రవరమున

రాజ్య స్థాపన మొనరించి ప్రజా రంజకముగా రాజ్యపాలన మొనరించు చున్న నల్లయవేము వీరభద్రారెడ్ల యొద్దకుఁ జేరెను అప్పుడు వేముని నీ క్రిందివిధముగా వర్ణించెను.

సీ. రాజనందన రాజ । రాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేము । ధరణిపతికి
రాజనందన రాజ । రాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేము । ధరణిపతికి
రాజనందన రాజ । రాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేము । ధరణిపతికి
రాజనందన రాజ । రాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేము । ధరణిపతికి
భావభవభోగసత్కళా । భావములను
భావభవభోగసత్కళా । భావములను
భావభవభోగసత్కళా । భావములను
భావభవభోగసత్కళా । భావములను.

ఉ. వీర రసాతిరేక రణ । విస్మిత [illegible] ద్రేంద్ర! నీ యశం
బారభ మానతార కర । హ[illegible] రజా మహాం
బారభ మానతార కర । హ[illegible] మం
బారభ. [illegible]
[illegible] భూపతి
[illegible] నుందు

# కొండవీడు

---

ఈ కవిసార్వభౌముండు కర్ణాటరాజ్యమున కరిగినప్పుడా ధరణీకాంతుం డీతనిని జూచి "అయ్యా! మీ నివాసస్థల మేది? యని యడిగెనఁట. అప్పుడు శ్రీనాథకవితల్లజుం డిట్లు చెప్పెనఁట.

సీ. పరరాజ్య పరదుర్గ । పరవైభవ శ్రీలఁ
గొనకొని విడనాడు । కొండవీడు
పరిపంథి రాజన్య । బలముల బంధించు
గుఱుతైన యురిత్రాడు । కొండవీడు
ముగురు రాజులకును । మోహంబు పుట్టించు
కొమరు మీఱిన జోదు । కొండవీడు
చటుల విక్రమకళా । సాహసం బొనరించు
కుటిలాత్ములకు గాదు । కొండవీడు
జవనఘోటక సామంత । సరసవీర
భట నటానేక హాటక । ప్రకట గంధ
సింధురాద్భుత మై[illegible] । శ్రీలఁ దనరు
కూర్మి [illegible] । కొండవీడు.

కం. నెఱులిపురి యమపురముగా
యముఁ డాయెను బసివిరెడ్డి । యంతకు మున్నే
యమదూత లైరి కాపులు
క్రిము లెఱుఁగని మన్నె లైరి । కరణాలెల్లన్.

---

## తిలఘాతకురాలు



శ్రీనాథునిఁ గూర్చి యీక్రింది యితిహాస మొకటి పెద్దలు చెప్పుదురు. ఇది యెంతవఱకు సత్యమో పాఠకమహాశయులే యూహించుకొందురు గాక.

శ్రీనాథుఁ డొకనాఁ డొక తెలికలదానిని జూచి దానిని వరించి యామెకు తన యభీష్టము వెల్లడించుకొనెనఁట. ఆమె యాతని కోరిక కనుమతింప లేదఁట. అప్పు డాతఁ డామె ననేక విధంబుల బ్రతిమాలి సమ్మతింపు మని ప్రార్థనాపూర్వకముగా బ్రతిమా లాడెనఁట. ఎట్టకేల కామె కొంత బెట్టుసరితో నొప్పుకొనె నఁట. ముం దాతని కోరిక తిరస్కరించి తరువాత నంగీకరించుటచే యాతని కామె యెడ కొంచెము సంశయము గలిగి యచ్చట నున్న కాళికాలయములోనికి దానిని దోడ్కొని పోయి "సాయంసమయమునకుఁ దప్పక వచ్చెద" నని యా కాళికాదేవి శిరముపైఁ జేయునుంచి ప్రమాణికముఁ జేయు మని కోరెను. ఆమెయు నాతని కోరిక కనుగుణ్యముగాఁ బ్రమాణిక మొనర్చి యప్పటి కాగండము తప్పించుకొని పోయినదఁట.

అనుకొన్న సమయమునకు సరిగా శ్రీనాథుఁడు కాళికాలయమున కరిగెను. తెలికది యింకను రాలేదు. ఆమె యిప్పుడే వచ్చునో యింకనే వచ్చునో యని పాప మాతఁడు నిద్రగూడ మానుకొని యర్థరాత్రము వఱకును నిరీక్షించి యుండెనఁట కాని యా వనిత రానే

లేదు. అప్పు డాతనికి విశేషముగాఁ గోపము వచ్చినది. కోపము వచ్చిన మాత్రి మితఁ డెవరి నే మనగలఁడు? ఏమియుఁ జేయ లేక కాళికా దేవి మీఁద నీ పద్యము జెప్పెనఁట.

చ. గొఱియల మేకపోతులను । గొమ్ము పొటేళ్ళను గావు గొందు వీ
వరయఁగ సందెకాడఁ దగ । వత్తు నటంచు భవచ్ఛిరంబు పైఁ
గర మిడి పోయినట్టి తిల । ఘాతుకురాలి తదీయ..............
పెఱుకఁగ లేవు నీవు నొక । భీకరమూర్తివె కాళికేశ్వరీ!

# రేనాఁడు

ఇది పల్నాటిసీమలోని యొక కుగ్రామము. పల్నాటిసీమ జొన్నలకుఁ బ్రసిద్ధి. పల్నాటి సీమలో నున్నంతకాల మీా కవివర్యుండు గూడ సన్నన్న మెఱుంగఁ డనుట నిర్వివాదాంశము. ఈతఁ డాగ్రామములో నుండి యిట్లు పలికెను.

కం. గరళము మ్రింగితి నంచున్
బురహర! గర్వింపఁ బోకు । పో పో పో నీ
బిరు దింకఁ గాన నయ్యెడి
మెఱసెడి రేనాటి జొన్న । మెతుకులు తినుమీా.

తా. అమృతము కొఱకై పాలసముద్రము నుదరచినప్పుడు బుట్టిన హాలాహలముఁ జూచి దేవత లెల్లరును బరుగిడుచుండ దానిని నీవు నీ గళమందు దాఁచికొని యందఱచేతను బొగడ్తఁ గంటివి. అట్టి హాలాహలము గొంతులో నీ ప్రజ్ఞ యేమియు లేదు. ఈ రేనాటి జొన్న మెతుకులు మ్రింగుము. అప్పుడు నీ శక్తి సామర్థ్యంబులు లోకమునకు వెల్లడి యగును.

## శబర కాంతలు

కం. గిట గిట నగు నెన్నడుములు
పుట పుట నగు చన్నుఁగవలు । పున్నమ నెలతోఁ
జిట పొట లాడెడు మొగములు
కటితటముల కొమరు శబర । కాంతల కమరున్.

గీ. వీనులకు నిండులై తేనె । సోన లెనయు
ముందు రాగంబునను జగ । న్మోహనముగ
పాడె నొక జాలరిమిటారి । యీడు లేని
కాకలీనాదమున నోడఁ । గడపు పాట.

## దక్షిణ దేశపు ముచ్చట్లు

గీ. మేఁతఁ గరిపిల్ల పోరున । మేఁకపిల్ల
పాఁపఁబోతుతనంబునఁ । బందిపిల్ల
యెల్ల పనులను జెరుపంగఁ । బిల్లిపిల్ల
యందమునఁ గోఁతిపిల్ల యీ । యఱవపిల్ల.

సీ. కూడు తలఁపఁ జొళ్ళు । కూర కారామళ్ళు
చెప్పులంత వ్రేలాళ్ళు । చేలుమళ్ళు
దుత్తైడే నాగళ్ళు । దున్నపోతుల యేళ్ళు
కలవు మాపటివేళ । గంజినీళ్ళు
మాటమాటకు ఁబుళ్ళు । మఱి దొంగ దేవళ్ళు
చేదైనపచ్చళ్ళు । చెరుకునీళ్ళు
వంట పిశ్కలదాళ్ళు । వాడనూతుఁనీళ్ళు
వినవిరుద్ధపుఁ బేళ్ళు । వెడదనోళ్ళు

సఖులచన్నులబైళ్ళు । చల్లని మామిళ్లు
పరువైన వావిళ్ళు । పచ్చవళ్ళు
దళమయినట్టి కంబళ్లు । తలలు బోళ్ళు
పయిఁడికిని జూడఁ బయిడెత్తు । ప్రత్తివిళ్ళు
చలముకొని వెదకినను లేవు । చల్లనీళ్ళు
చూడవలసెను ద్రావిళ్ళ । కీడుమేళ్ళు.

సీ. తొలుత నే వడ్డింత్రు । దొడ్డమిర్యపుఁజారు
చెవులలోఁ బొగ వెళ్ళి । చిమ్మరేఁగఁ
బలు తెఱంగులతోడఁ । బచ్చళ్ళు చవిగొన్న
బ్రహ్మరంధ్రము దాఁకఁ । బారునావ
యవిసాకు వేఁచిన । నార్వెల్లుపసిలేదు
పరిమళ మెంచినఁ । బల్లు సొగచు
వేపాకు నెండించి । వేసిన పొళ్ళచు
గంబానఁ గాంచినఁ । గోళ్ళు వచ్చు
పరవవారింటి విందెల్ల । నాగడంబు
చెప్పవత్తురు తమతీరు । సిగ్గులేక

* * * * *

చూడవలసెను ద్రావిళ్ళ । కీడుమేళ్ళు.

---

## రాచవీడు

చ. పసగల ముద్దుమోవి బిగి । పట్టిపగుబ్బలు మందహాసముల్
నొసట విభూతిరేఖయుఁ బ । సంగున తావి విటాళిచూపులన్
రసికులు మేలుమేలు బళి । రా యని మెచ్చఁగ రాచవీటిలోఁ
బసిఁడిసలాకవంటి యొక । పల్లవపూటిసి గంటి వేడుకన్.

# నీలాటిరేవు

ఒకనాఁ డుదయమున శ్రీనాథుఁడు స్నానార్థ మరిగి యొకతటాకపులొడ్డునఁ గూర్చుండెను. అంతకుమున్నే నీటికై చనుదెంచిన గరితలు కొందఱు స్నానంబులాడుచుండిరి. కొందఱు బట్ట లుతుకుకొనుచుండిరి. మఱికొందఱు నీటిని బిందెలలోఁ బట్టుకొని గృహాభిముఖులై పోవుచుండిరి. కొందఱునీటిని సంగ్రహించుకొని బిందెలు భుజములపైఁ బెట్టుకొని తమచెలులరాకకై నిరీక్షించియుండిరి. శ్రీనాథుఁడు రేవులో స్త్రీలున్నారను సంశయముతో గట్టుపైఁ గూర్చుండియుండెను.

స్త్రీలును యాతఁడు గట్టుమీఁదఁ గూరుచుండి తాము వెడలిన పిదప స్నానముచేయుటకై వేచియున్నాఁడని గ్రహింపక సొల్లుపురాణములచేఁ గాలయాపనముఁ జేయుచుండిరఁట ఆతఁ డూరక వారివారి సంభాషణం బాలించుచు, వా రెప్పుడు వెడలుదురా యని నిరీక్షించి యుండెను కాని వారుమాత్ర మటనుండి కదలలేదు. ఆ సందర్భమున నీలాటిరేవులో నున్నకాంతలఁ గూర్చి చెప్పినపద్యములు.

ఉ. వీసపు ముక్కుఁ గుత్తునక । వీసపు ముంగరసూత్రమున్ననన్
గాసురురాని కమ్మలర । కాసురుగాసవి పచ్చపూసలన్
మాసినచీరఁ గట్టి యవ । మానము సంగఁగ నేఁడు రాఁగ నా
కాసలవాటివారి కన । కాంగిని జూచితి నీళ్ళరేవునన్.

శా. పొచ్చెం బింతయులేని హంసపదుతోఁ । బొంపొందు లేనవ్వుతోఁ
బచ్చల్దాపిన కుల్కుముంగరలతో । బాగైన కెమ్మోవితోన్
నచ్చంబైన ముసుంగు వెట్టి చెలితో । నామాటలే యాడుచున్
వచ్చెంబో కుచకుంభముల్ గదలఁగా । నామాక్షి తా నీళ్ళకున్.

ఉ. శ్రీకరభూషణంబులును । సిబ్బెపుగుబ్బలు ముద్దుఁ జెక్కులున్
గోకిలవంటి పల్కులును । గొల్చినఁ జేఱలఁ గేరుకన్నులున్
బ్రాకటదేహకాంతియును । బంగరుబొమ్మను హెచ్చువచ్చు నీ
చాకలవారి జవ్వనికి । సాటిక రారిఁకఁ దొంటిజవ్వనుల్.

కం. నీలాటిరేవు లోపల
మేలిమితోఁ దీర్చినట్లు । మెఱసి నిలుచుచుం
దాలిమిని వాలుఁ జూపులు
బాలామణి గుట్టు బైటఁ । బడఁగాఁ జూచెన్.

ఇట్టి సమయంబున నొకపూజారివారికోడలు నీళ్ళబిందెను భుజముపైఁ బెట్టుకొని గట్టునెక్కుచు, వెంటవచ్చువారితో మాటలాడుచుఁ దనచెలిమికత్తియ యింకను వచ్చుటలే దేమని వెనుకకుం జూచుచు ముందునకు నడచుచుండెను. వెనుకకుఁ జూచుచు ముందునకు నడచుటలో కాలుజాఱి పడిపోయినదఁట. ఆమె వెంటనే లేచి, పడినందుకుఁ దన్నుం దఱును గేలిసేయుదురేమో యని సంశయముతో నామెయే యిటునటు జూచి పక్కుననవ్వినదఁట. ఈ యంశ మీక్రిందివిధముగాఁ జెప్పెను.

కం. పూజారివారి కోడలు
తా జాఱఁగ బిందె జాఱి । దబ్బున బడియెన్
మైజాఱు కొంగు దడిసిన
బాజాతే తిరిగి చూచి । పక్కున నవ్వెన్.

---

## అడిగొప్పుల

కం. గుడిమీఁది కోఁతితోడను
గుడిలోపలి నంబివారి । కోడలితోడన్

నడివీధి లంజతోడను
నడిగొప్పుల యోరుగాలి । నడిగితి ననుమీ.

ఈతని కడిగొప్పులలోఁ జాలమంది మిత్రులుగలరఁట. కవిసార్వభౌముని నెఱుఁగనివారు గలరా? ఈతనిమిత్రుఁ డొక డడిగొప్పుల వెడలుచు నే నడిగొప్పుల వెడలుచుంటిని. నీమిత్రుల కేమైన వార్తలు జెప్పెదవా యని యాతఁ డడిగినప్పుడు పై విధముగాఁ జెప్పెనఁట.

## కడిదిపురము

శ్రీనాథుఁడు "కడిదిపురము" అనుగ్రామ మొక కార్యార్థమై వెడలెనఁట. ఆ గ్రామంబునఁ బండితులుగాని, చక్కనియంగనలుగాని, సరసులుగాని గాన్పింపనప్పు డా పురంబుపై నేవగించుకొని యీక్రింది పద్యమును జెప్పెనఁట.

కం. ముదివిటులు విధవలంజలు
పదకవితలు వూఁబుబాస । బాపనవర్యుల్
జదువని పండితవర్యులు
కద, నాస్తి వీరవరులు । కడిదిపురనన్.

ఆ పురంబులోని వారకాంత యొద్ద రసికత, సౌందర్యము, నాగరికత మున్నగునవి లేవని యెఱింగి యీ పద్యమును జెప్పియుండెను.

ఉ. చీరయు ముక్కు ముంగిరయుఁ । జెంపల గంధము చుక్కబొట్టుమం
జీర ఝణంఝణారవము । జేతులఁ గంకణ నిక్వణంబు ను
య్యారపు జాఱుకొప్పును గ । యాళితనంబును గాని లోన శృం
గార మొకింత లేదనుటఁ । గంటిని యాపురి వారకాంతలన్.

## పడమటిసీమ వ్యాపారులు.



శా. దస్త్రాలున్ మసిబుఱ్ఱలుం గలములుం । దార్కొన్న చింతంబళుల్
పుస్తుల్ గారెడు దుస్తులుం జెమటకం । పుంగొట్టు నీర్కావులుం
అస్తవ్యస్తపుఁ గన్నడంబుకు భయం । బైశ్వోఁచు గడ్డంబులున్
వస్త్రాచూస్తిమి రోస్తిమిన్ బడమటన్ । వ్యాపారులన్ గూర్తురులక్షా



## కొన్ని పద్యములు.



ఈకవిసార్వభౌముఁ డెల్లప్పుడును దేశాటనమే చేయుచుఁ గనంబడిన ప్రతి యువతినిఁ గూడ నేదియో యొక విధముగా నాక్షేపించుచునే యుండెడివాఁడఁట. అందు లభ్యమైనకొన్ని పద్యము లిందుపొందుపఱచుచున్నాను.

ఉ. వాలగు కన్నుదోయి బిగి । వట్రువ గుబ్బలు కాఱుచీఁకటిం
జాల హసించు కొప్పుజిగి । పారసము న్నగుమోముగల్గునా
బాలికఁ గూలి కమ్మకొన । బట్టులు నేసెడు వాని కిచ్చె హా
సాలెతగాదురా కుసుమ । సాయకు కట్టపుదంతి యింతియే.

కం. ఆకదురునఁ బికరవముల్
ఆకదురున భృంగరవము । నాత్మరసంబుల్
ఏకీకృతముగ నేకు ల
నేకులు విన వడికె ముదిర । యేకులముదిరా?

ఒకనాఁ డీతండు జగన్మోహిన్యవతారము నిర్మించిన సోయగముగల నొక కాపుదానినిఁ జూచి యామె సౌందర్యాతిశయంబుల కబ్బుర పడుచుండ నింతలో యామెభర్త గృహంబున కరుదెంచెనఁట. ఆమెయును

రూపలావణ్యాతిశయంబుల కీతఁ డెంత యాశ్చర్యపడియెనో యామెభర్త వికారాకారము జూచి యంతకంటె వేయిరెట్లెక్కువగా విచారించి సృష్టికర్త నవలోకించి యిట్లనియెను.

ఉ. గుబ్బలగుమ్మ లేఁజిగురుఁ । గొమ్మ సువర్ణపుఁ గీలుగొమ్మ బల్
గబ్బివిటారి చూపు లది । కాఁపుది దానికి నేల యొక్కనిన్
బెబ్బులి నంటఁ గట్టితివి । పెద్దవు నిన్ననరాదు గాని దా
నబ్బ ! పయోజగర్భ !! మగ । వానికి నింత విలాస మేలరా ?

ఒక జంగమకాంత విశ్వేశ్వరారాధనసమయంబున "గిరిగిండ్లు" అను వాయిద్యమును వాయించుచుండఁగాఁ జూచి—

శా. దాయాదుల్ వలె గుబ్బచన్నులొరయన్ । ధావళ్యనేత్రాంబుజ
చ్ఛాయల్ తాండవమాడఁ గేరి పురుష । స్వాంతంబునన్ మన్మథుం
డేయం జంగమవారి చంద్రముఖి వి । శ్వేశార్చనావేళలన్
వాయించెన్ గిరిగిండ్లు బాహుకుశల । వ్యాపారపారీణతన్.

ఒక కుమ్మరిబాలిక యావములోనుండి కుండలఁ దీయుచుండఁగా శ్రీనాథుండు చూచి—

ఉ. కుమ్మరివారిబాలిక చ । కోరవిలోచన ముద్దుగుమ్మ యా
వమ్ముదరిన్ రసామలిన । వస్త్రము చెంగులు జాఱఁగట్టి తాఁ
గమ్మని మోవితోఁ గరవ । ఘుమ్ముల భాండము లంగజాస్త్ర పా
తమ్మునఁ బోవుఁ దీసె విట । తండము గుండియ లారవిచ్చగన్.

ఈతఁడు రాజబాటఁబడి పోవుచుండఁగా నొక యిల్లాలు తనయింటిముంగిలి వాకిట బియ్యము దంపుకొనుచుండఁగాఁ జూచి

ఉ. పువ్వులు కొప్పునం దురిమి । ముందఁగ గా నసియాడుచుండఁగాఁ
జెవ్వనఁ బంగసాఁచి యొక । చేతను రోకలిబూని యొయ్యనన్
నవ్వుముఖంబుతోడఁ దన । నందనుఁ బాడుచు నాథుఁ జూచుచున్
నువ్వియ నువ్వియంచు నొక । సుందరి బియ్యముదంచె ముంగిటన్.

పిండిరుబ్బుకొనుచున్న నొక యువతీమణిఁ జూచి—

సీ. తాటంకయుగధగ । ద్ధగిత కాంతిచ్ఛటల్
చెక్కుటద్దములపైఁ । జీరువార
నిటలేందు హారసిల । కుటిలకుంతలములు
చిన్నారి మోమునఁ । జిందుద్రొక్క
బంధురమౌక్తిక । ప్రకటహారావళుల్
గుబ్బచన్నులమీఁద । గునిసియాడ
కరకంకణక్వణ । క్వణనిక్వణంబులు
పలుమారు రాతిపైఁ । బరిఢవిల్ల
ఓరచూపుల విటచిత్త । మూఁగులాడ
బాహుమూలశోభఁ జక్కని । మోహనాంగి
పాటఁ బాడుచుఁ గూర్చుండి । రోటిమీఁదఁ
బిండి రుబ్బంగఁ గన్నుల । పండువగు.

ఈశ్వరుం సేవింప వలయునను నభిలాషంబు పెంపున నొక యబలాశిరోమణి శివాలయమున కరుదెంచుటఁ గాంచి—

సీ. బొమవింటఁ దొడిగిన । పూవింటిదొంతులిక్కి
పోల్కిఁ గస్తురిపొఁగ । బొట్టుదిద్ది
చకచకలీను తా । రకల రేకలువోలె
గొలుసులు వెడలఁగ । జలముదీర్చి
పొడుపుగుబ్బలిమీఁదఁ । బొడమునీరెండనా
రంగుచందురు కావి । రైకదొడిగి
పిడికిటఁ బొక్కిలియును । మొనకపల్లముగప్పఁ
బాలవెల్లువవంటి । చేలగట్టి
అంచకొదమలగమి బెదరించుపోల్కి
నందెచప్పుళ్ళు ఘల్లు ఘ । ల్లనుచు మొరయ

నడుము జవజవలాడ గీ । ల్జడ ఘటించి
వచ్చె ముక్కంటి సేవకు । మచ్చెకంటి.

మ జ్జగంబులను మోహసాగరంబున ముంచివేయఁగల సౌంద ర్యరాశియగు నొక యబలామణిఁ గాంచి యామె సోయగమున కబ్బు రపడి యాలేమ నీ శ్రీనాథకవిసార్వభౌముఁ డిట్లాశీర్వదించెను.

సీ. శ్రీరస్తు భవదంఘ్రి । చికురంబులకు మహా
భోగ్యబద్ధములు సితాం । భోజనయన!
వరకాంతిరస్తు తా । వకముఖనఖముల
కాచంద్రతారకం । బబ్జవదన!
మహిమాస్తు నీ కటి । మధ్యంబునకు మన్న
మిన్నగలవ్యాప్తి । మించుబోఁడి!
విజయోస్తు నీగాన । వీక్షల కాన్పిల
కంఠహరిస్థాయి । గా లతాంగి!
కుశలమస్తు లసచ్చాత । కుంభకుంభ
జంభభిత్కుంభికుంభాభి । జృంభమాణ
భూరి భవదీయ వక్షోజ । ములకు మేరు
మందరములుండు పర్యంత । మిందువదన!

సీ. చక్కని నీముఖ । చంద్రబింబమునకుఁ
గల్యాణమస్తు బం । గారుబొమ్మ!
నిద్దంపు నీచెక్కు । టద్దంపు రేకకు
నైశ్వర్యమస్తు న । య్యంపుకీవి!
మీటినఁ బగులు నీ । మెఱుఁగుఁ జాలిండ్లకు
సౌభాగ్యమస్తు భ । ద్రేభయాన!
వలపులు గులుకు నీ । వాలుఁ గన్నులకు న
త్యధికభోగోస్తు ప । ద్మాయతాక్షి!

మధురిమములొల్కు నీముద్దు । మాటలకును
వైభవోన్నతిరస్తు లా । వణ్యసీమ !
వన్నెచిన్నెలు గల్గు నీ । మన్ననలకు
శాశ్వతస్థితిరస్తు మో । హాలలామ !

ఏదియో యొక కార్యార్థమయి వెడలిపోవుచున్న యొకజంగమ కాంత న్గూర్చి చెప్పినపద్యములు.

సీ. సొగసు కీల్జడదాన ! । సోగకన్నులదాన !
వజ్రాలవంటి ప । ల్వరుసదాన !
బంగారుజిగిదాన ! । పట్టుపుగుబ్బలదాన !
నయమైన యొయ్యారి । నడలదాన !
తోరంపుఁ గటిదాన ! । తొడలనిగ్గులదాన !
పిడికిటనడఁగు నె । న్నడుముదాన !
తళుకుఁ జెక్కులదాన ! । బెళుకు ముక్కరదాన !
సింగాణి కనుబొమ । చెలువుదాన
మేలిమిపసిండిరవకడి । యాలదాన !
మించిపోనేల రత్నాల । మించుదాన !
తిరిగిచూడవె ముత్యాల । సరులదాన !
చేరిమాటాడు చెంగావి । చీరదాన !

అప్పుడామెలనాగ యేకారణముననో వెనుదిరిగి చూచినదఁట. ఆమె జంగమకాంత గావున యామె ఫాలభాగమునయున్న విభూతిబొట్టు కాన్పించినది. రతీదేవికన్న మిన్నయగు నబ్బాలారత్న మట్లు విభూతి ధరించుటచే నామెసోయగమున కించుక కళంకమువచ్చినట్లుగాఁ గనఁబడి యిట్లనియెను.

క. కుంకుమ లేదో ? మృగమద
పంకము లేదో ? పటీర । పాంసువు లేదో ?

సంకుమదము లేదో? యను
భంకరమగు భస్మమేల! బాలా! నీకుఁ?

ఈతఁడు రాజమహేంద్రవరమునను సమయమున నీతని బలాత్కారముచే నీతనిసాంగత్యమున కనుమతించిన యొకవనిత యొక యమూనాస్యనాటిరేయి పీఠికలయిక కొక ముహూర్త మేర్పఱచి నాఁటిరేయి వచ్చియు నీతని నేకారణముననో మోసగించి యాకాఱుచీఁకటిలో మాయమైపోయినదఁట. అప్పుడాతఁ డాభామినిని గూర్చి యిట్లు చెప్పెను.

ఉ. హా! జలజాక్షి! హా! కిసల యాధర! హా! హరిమధ్య! హా! శర
ద్రాజనిభాస్య! హా! క్రముద తంత్రకళానిధి! యెంతుఁబోయితే
రాజమహేంద్రవీధిఁ గవి రాజు ననుం గికురించి భర్గకం
ఠాజితకాలకూటఘటి కాంచిత మైన యమూసచీఁకటిన్.

ఈతఁ డొకమారొక పై మెఱుఁగుల మద్దియం జూచి యామె స్వభావం బంతఁగాఁ దెలిసికొనక యామెను గూడవలయునని యుబలాట పడెను. ఆమె తొలుతనే పతితురాలు కావున నీతనితోఁ గూటమున కామెయు సంతోషము జూపించినది. ఆమె యంగీకారము న్విని పెన్నిధిగన్న పేదచందంబున సంతోషించి యారేయి యామెతోఁ గూడుటకై పోవుచుండెను. మార్గమధ్యమున నీతని చిరకాల మిత్రుం డొకఁ డీతని చిత్రచరిత్రమంతయు విని యాతనిఁ గలసికొని యాతఁడు కామించిన యువతి కేవలము తుచ్ఛురాలనియు, రోగములకుప్ప యనియుఁ దెల్పి యాతని దురుద్దేశము మాన్పి గృహంబునకుఁ దోడ్కొనిపోయెనఁట. అప్పుడా కవిసార్వభౌముఁ డిట్లు చెప్పెను.

ఉ. గండము దప్పె నాంధ్రకవి గానికి నిన్నటిరేయి పుప్పొడో
దండుని గారవింపకయ తద్దయు నిల్చితిఁ గాని యయ్యహో

బాడరువారి పాపికిని । బైటిపసారమై యట్టిదైనయిం
బుడయి యెల్లవంకఁ జెడి । పోవ్రుసుగా! యటు సోయియుండినన్.

ఈతఁడు శ్రీరంగక్షేత్రమున కరిగినప్పుడొక వైష్ణవ యువతిఁ జూచి యామె సోయగంబున కబ్బురపడుచు చెప్పిన పద్యము.

సీ. ఒకచెంప కొరగా । నొనగూర్చి దిద్దిన
తుఱుమున నుండి క్రొ । వ్విరులు రాల
రాతిరి నిదురఁ గూ । రమిఁ జేసి ముడివడు
బడలిక నడుగులు । తడఁబడంగ
వింతవారలఁ జూచి । వెసనవ్వ నెడఁగప్పు
గల దంతముల కాంతి । వెలికిఁ బాఱ
చిఱుముడి నడచుటఁ । జెలరేఁగి గుబ్బల
పైఁ దాఁకి యొక్కింత । పైఁటజాఱ
చెమటచేఁ దిరునామంబు । చెమ్మగిల్ల
హాళి డాచేత విడియంబు । గీలుకొల్పి
రంగపురి రాజవీధి గా । నంగనయ్యె
నాదు మదిఁ గోర్కులూర వై । ష్ణవవధూటి.

ఈ కవితల్లజుఁ డొకమారు రెడ్ల ప్రాచీన రాజధాని యగు నద్దంకి కరిగినప్పు డొక గాజుల యువతిం జూచి యామె సోయగమున కబ్బురపడి గాజు లమ్ముకొనువాని యర్థాంగియే కాయజు రాణి న్మించి యున్నదే. వహ్వారే యేమి దీని సోయగము. ఇట్టి యపురూపలావణ్యాతిశయంబునఁ గ్రాలి నీ తన్వంగిఁ బెండ్లియాడిన నీమె భర్త యదృష్ట మెట్టిదో గదా యని యనుకొనుచు నీపద్యము జెప్పెను.

సీ. తళుకుతళుకను కాంతి । బెళుకు కెంపులముంగ
రందమై కెమ్మోవి । యందుఁ గుల్క

ధగధగ ద్ధగలచేఁ । దనరారు బంగారు
గొలుసు లింగపుఁగాయ । కొమరు మిగుల
నిగనిగ న్నిగలచే । నెగడు చెల్వపుగుబ్బ
దోయి యొండొంటితో । రాయిడింప
రాజహంస విలాస । రాజితం బగుయాన
మందు మెట్టెలు రెండు । నందడింప
సరస దృక్కుల విటులను । గరఁగఁ జూచి
పొందికైనట్టి మోమున । భూతిరేఖ
రాజకళ లొప్ప నద్దంకి । రాజవీథిఁ
బొలిచె నొకకొమ్మ గాజుల । ముద్దుగుమ్మ.

---

## ప్రౌఢదేవరాయలు.

కర్ణాటాధీశ్వరుఁడైన ప్రౌఢదేవరాయలను శ్రీనాథుఁడు దర్శింపఁబోయెను. ప్రౌఢదేవరాయల యాస్థానమున ధర్మాధికారిగా "ముమ్మకవి" యను పేరి విఖ్యాతకవి యొకఁ డుండెనఁట. ముందుగా శ్రీనాథుఁ డా కవితల్లజుని దర్శించి యిట్లు చెప్పెనఁట.

సీ. పంపావిరూపాక్ష । బహుజటాజూటికా
రగ్వధ ప్రసవ సౌ । రభ్యములకు
తుంగ భద్రాసము । త్తుంగవీచీఘటా
గంభీరఘుమఘుమా । రంభములకు
కళసాపురప్రాంత । కదళీవనాంతర
ద్రాక్షా లతాఫల । స్తబకములకు
కర్ణాటకామినీ । కర్ణహాటకరత్న
తాటంక యుగధాళ । ధళ్యములకు

ర్నిబంధనిబంధమై । నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ । బలుక నేర్తు
ప్రౌఢదేవేంద్రరాయ భూ । పాలవరుని
సమ్ముఖంబున దయఁ జూడు । ముమ్మసుకవి.

చ. తరువున గాండివం బిడఁడె । ధర్మజు నానఁ గిరీటి యేమినా
క్సరసిజనేత్రి యానతి వి । చారము చొప్పున గర్వహీనతన్
మరలి తెలుంగుభూమికస । మానతతిం గొనిపోవువాఁడనై
బిరుదులు నారివాఁగు కడఁ । బెట్టితి సత్కవి సార్వభౌముఁడన్.

శ్రీనాథుఁ డీవిధముగాఁ బ్రార్థించినప్పు డట్లనే యని తలనూఁచి యెంతకాల మైనను రాయల దర్శనభాగ్య మీతనికి గలుగనీయలేదు. పాపము శ్రీనాథుఁడు రాజదర్శనోత్సాహియై చాలకాలము నిరీక్షించి యుండెను. ఏ ఫలమును లాభింపలేదు. ఇంక ముమ్మకవివలనఁ దనకు లాభము లేదని తలంచి తానే స్వయముగా నొక పద్యమును రచియించి రాజున కందఁజేసెను. ఆ పద్యమిది.

సీ. కంబుసూపి ధరాత । లంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁ గాని నా । కవచ మేయ
దుష్ప్రయోగంబుల । దొరఁకొని చెప్పెడు
కవిశిరస్సునఁ గాని । కాలు చాఁప
సంగీత సాహిత్య । సరసవిద్యల నేర్పు
కవులఱొమ్ములు గాని । కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి । సభయందు విలసిల్లు
కవినోరఁ గాని వ్రే । క్కలుగఁ దన్న
దంటకవులకు బంటనై । యుంటిమగఁడ
కవుల వాదంబు వినవేడ్క । గల్గెనేని

నన్నుఁ బిలిపించు మాస్థాన । సన్నిధికిని
లక్షణోపేంద్ర ప్రౌఢరా । యక్షితీంద్ర.

కట్టకడపలుకు రాయల దర్శనభాగ్య మీతని కొదవినది. డిండిమభట్టు ప్రత్యర్థి పండితుఁడుగా నియమింపఁబడెను. వారిరువురకును వాదన ప్రతివాదనము లైనవి కాని యా యంశము లభ్యముగా లేదు. ఆ వాదనములోఁ గవిసార్వభౌముఁడే జయ మందెనఁట. అప్పుడా ప్రౌఢదేవరాయలు మన కవితల్లజునిఁ జూచి—

"బాలను, యువతిని, ప్రౌఢను, లోలను, గూర్చి వర్ణింపుము" అని కోరెనఁట. శ్రీనాథుఁ డప్పుడు చెప్పిన పద్యములలో నొక్కటియే లభించినది. ఆ పద్యము మొట్టమొదటిది యగు బాలను గుఱించి చెప్పినది. తక్కిన పద్యములు లభ్య మైనచో రాఁబోవు కూర్పున కందఁజేయుదును.

సీ. కమనీయ కర పల్ల । వము మేను గదియంగ
నెయ్యన జాఁచిన । నులికిపడును
ఆలింగనమునకు । నక్కునఁ జేర్చిన
జేవోయి యురముపైఁ । జేర్చుకొనును
చుంబనమ్మున కోష్ఠ । బింబంబు గమకింప
వదన మొయ్య నొకింత । వంచుకొనును
గిలిగింత సేతకుఁ । గినుకయు సిగ్గును
మొలవంగఁ గన్నులు । మోడ్చుకొనును
అట్టిబాల రతిక్రీడ । ననువు పఱుప
నేర్పు గల్గునె పురుషులకు । నిక కాక
రాజ పరమేశ! రాజాధి । రాజ విభవ
లక్షణోపేంద్ర! ప్రౌఢరా । యక్షితీంద్ర!

తనకు జయము లభించిన పిమ్మట శ్రీనాథుఁ డీపద్యమును జెప్పెనఁట.

మ. జననాథోత్తమ! దేవరాయనృపతీ! । చక్రేశ! శ్రీవత్సలాం
ఛనసంకాశ! మహాప్రభావ! హరి । రత్నాదక్ష! నాబోఁటికిన్
గునృపస్తోత్రసముద్భవం బయిన వా । గ్దోషంబు శాంతంబుగాఁ
గనకస్నానముచేసి కాక పొగడం । గా శక్యమే దేవరన్.

శ్రీనాథుని కోరికపైన కనకస్నాన మహోత్సవము జరిగినదఁట. అప్పు డీపద్యముచే దేవరాయలను స్తుతించినాఁ డఁట.

శా. జోటీ! భారతి! యోర్భటిన్ మెఱయుమీ । చోద్యంబుగా నేనుగ
ర్ణాటాధీశ్వరుఁ బ్రౌఢదేవ నృపతిన్ । నాసీర ధాటీచమూ
కోటీఘోటకధట్టికాఖురపుటీ । కుట్టాకసంఘట్టన
స్ఫోటీభూత ధరారజశ్ఛులుకితాం । భోటిన్ బ్రశంసించెదన్.

## వివాదము

రాజమహేంద్రవరమునఁ బండితులతో వివాద పడి చెప్పిన పద్యము.

మ. శ్రుతిశాస్త్రస్మృతులభ్యసించుకొని వి । ప్రుం డంత నానాధ్వర
వ్రతుఁడై పోయి కనన్ బురందరపురా । రామద్రుమానల్ప క
ల్పతరుప్రాంతలతాకుడుంగ సుఖసు । ప్తప్రాప్త రంభాంగనా
పతి...కరపాటనక్రియ కళా । పాండిత్య శౌండీర్యముల్.

## మాదయలింగమనేఁడు

తెలుఁగోటి మాదయలింగమనేఁ డొకమాఱేదియో కారణమున రెడ్ల కొమార్తెనిఁ బట్టుకొని నిజస్థానంబునకుఁ బోయెను. కతారి

శాత్రవుని పాలయిపోవుటచే రెడ్లకు తలకొట్టిన ట్లుండెను. కాని యేమి చేయఁగలరు ? అప్పుడు శ్రీనాథుఁడు తిన్నఁగా వెలుగోటి మాదయ లింగమనేని దర్శనమునకుఁ బోయి యాతనినిఁ గాంచి—

సీ. జగనొబ్బగండాంక । సంగ్రామ నిశ్శంక
జగతీశ రాయవే । శ్యాభుజంగ
అఖిల కోటల గొంగ । యరిరాయ మదభంగ
మేలందు ధరణీశ । మీనజాల
మూరురాయరగండ । మురియు రాజులమిండ
యభివృద్ధి మీరుచా । హత్తిమల్ల
ఘనకాయ గోవాళ । కామినీ పాంచాల
బ్రహ్మాయు శశివంశ । పరశురామ
దండిబిరుదుల సురతాణి । గుండె దిగుల
బళిర యల్లయవేముని । పగరమిండ
రమణ మించిన మేదిని । రావు బిరుద
సంగరాటోప! మాదయ । లింగభూప!.

ఇంక నెన్నియో విధంబుల నాతని నభినందించి తుద కాతని వలన నాక తారిం బడసి తను భూపతి కందఁ జేసినని పెద్దలు చెప్పుదురు.

## సింహాచలయాత్ర.

వేమ వీరభద్రారెడ్లు ప్రతి సంవత్సరంబును గూడ విషువత్ చందనయాత్రకు సింహాచలము వెడలుచుండెడి వారు. కొంతకాలము వీరే సింహాచల నృసింహస్వామివారికి దిరునాళ్ళు జరిపించుచుండెడి వారు. వారి వెంట మన శ్రీనాథుఁడు గూడ నరుగుచుండెడి వాఁడు. ఆ పర్వతము మీఁదికి యాత్రార్థమై వచ్చిన నానాజాతిస్త్రీలను జూచుచు వారివారి ననేక విధములుగా వర్ణించిన వర్ణనములు—

సీ. విడిన కొప్పున జాజి । విరులొప్పుగా రాలఁ
జిట్టి కుంకుమ చుక్క । బొట్టు చెదర
చక్కఁగాఁ బటువారు । సందెడు కుచ్చెళ్ళు
చెలఁగు వెట్టియలపైఁ । జిందులాడ
కొదమ గుబ్బలఁ బైఁట । కొంగు సయ్యాట జాఱ
ముక్కు నత్తొకవింత । ముద్దుగుల్క
మొలగంట లిమ్మగు । మ్రోఁతతో రంజిల్ల
గనకంపు టందియల్ । ఘల్లు రనఁగఁ
బొనఁగఁ గ్రొంపు వీడెముల్ । పొందు పఱిచి
యనుఁగుఁ జేడెలతో ముచ్చ । టాడుకొనుచు
నలరు సింహాద్రి పై కెక్కి । హర్షమునను
వచ్చె గలకంఠి వేసారి । మచ్చెకంటి.

శా. రాపాడంగల గుబ్బచన్నుఁగవతో । రాకేందు బింబంబుపైఁ
దూపేయంగల ముద్దు నెమ్మొగముతోఁ । దోరంపుమైచాయతోఁ
జూపున్ ముద్దులబాలసంఘములతో । సొంపారు లేనవ్వుతో
వేపార్యంగన వచ్చెఁ గాసెబిగితోఁ । వేణీభరచ్ఛాయతోన్.

సీ. పలు తెఱంగుల రంగు । పద్మరాగల వీణె
చకచక త్ప్రిభల సా । చౌత్కరింప
సొంపుతో రవచెక్క । డంపు మఁగర బాయ
జగడంపు మోపిపైఁ । బరిఢవిల్ల
విఁసి సూనసరిలి క్రి । క్కిఱిసిన చనుదోయి
బిగువున నెఱతైక । పిక్కటిల్ల
ఒనపరి యొయ్యారి । మసుఁగులో నెఱివేశి
కొమరాలి మూపునఁ । గునిసియాడ

విరుల తావియు నెమ్మేని । వెనుక కచ్చ
పెళ పెళక్కను బిఱుతొడల్ । బెసుకు నడుము
వలుదపిఱుఁదులు కలికిచూ । పుల బెడంగు
లోలయుఁ గన్గొంటి వేపారి । కలువకంటి

కం. రంభాస్తంభము లూరువు
లంభోరుహనిభము లడుఁగు । లతనుశరంబుల్
జంభాసురారి మదగజ
కుంభము లీ నంబివారి । కోడలి కుచముల్.

కం. అద్దిర కులుకులు బెళుకులు
నిద్దంపు మెఱుంగుఁదొడలు । నీటులు గంటే
దిద్దుకొని యేలవచ్చును
ముద్దియ యీ నంబిపడుచు । ముచ్చట దీఱన్.

వారి వెనుకనే సానపట్టిన శలాకవోలె మిసమిసలాడుచున్న నొక భాసురగాత్రిం జూచి రూపురేఖావిలాసములం బట్టి యగసాలికాంత యని గ్రహించి—

సీ. పొలుపొందఁగ విభూతి । బొట్టు నెన్నొసలిపైఁ
దళుకొత్త చెమట కు । త్తల పడంగ
సొగసుగాఁ బూదండ । జోఁపిన కీల్గొప్పు
జాఱఁగా నొకచేత । సరుకుకొనుచు
బిగి చన్నుఁగవ మీఁద । బిరుసు పయ్యెదచెంగు
దిగజాఱి శిరసూత్రి । మగపడంగ
ముక్కున హురుమాజి । ముత్యాల ముంగర
కమ్మవాతెఱ మీఁద । గంతు లిడఁగ
కాను జవ్వాడ మట్టియల్ । గదిసిమ్రోయఁ
గమ్మవిలుకాని జాళువా । బొమ్మ యనఁగ

మెల్ల మెల్లన సింహాద్రి । మీఁది కేగఁ
గన్న ప్రాఁబోఁడి యగసాలి । వన్నెలాఁడి.

తంబురా చేతఁబట్టుకొని నృసింహస్వామిపైఁ గీర్తనలఁ బాడుచు వచ్చుచున్న యొక సాతానివెలఁది గాంచి, యామె భక్తిమార్గమున కనువైన వేషంబున నుండకునికి యాబోటిపైఁ జెప్పినది.

సీ. మీఁగాళ్ళ జీరాడు । మేలైన కుచ్చెళ్ళు
తీరున మడిచీరఁ । దీర్చికట్టి
బిగువు గుబ్బలమీఁద । నిగనిగ ల్దళుకొత్తు
నోరపయ్యెదకొంగు । జాఱవైచి
వలపల కొకవింత । గలుగఁగాఁ గొప్పతో
కురులు నున్నగ దువ్వి । కొప్పువెట్టి
నెలవంక నామంబు । నలలితంబుగ నుంచి
తిరుచూర్ణ మామీఁదఁ । దీర్పు జేసి
ఓరచూపుల విటులఁ దా । నూరడించి
గిల్కుమెట్టెల రవరవల్ । గుల్కరింపఁ
జికిలిచేసిన తామ్రింపుఁ । జెంబుఁబూని
వీధి నేతెంచె సాతాని । వేడ్కలాఁడి.

ఒక జంగమకాంతను జూచి—

సీ. బాలేందురేఖ నం । పదమించి వీఁ సిల్లు
నొసటి తళ్కులనీటు । నూలుసేయు
భ్రమరికా హారినీల । చమరవాలములబోల్
వేణీభరము చాయ । వేయిసేయు
దర్పణ ద్విజరాజ । ధాళధళ్య ప్రభ
లపనబింబ స్ఫూర్తి । లక్షసేయు

కోకహాటక శైల । కుంభికుంభారాతి
కుచకుంభ యుగళంబు । కోటసేయు
జఘనసీమకు విలువ లెం । చంగ వశమె
దీని సౌందర్య మహిమంబు । దేవుఁ డెఱుఁగు
నహహా! యెబ్బంగి సాటి సే । యంగవచ్చు
భావజునికొల్వు జంగమ । భామ చెల్వు.

నియోగిభామను జూచి వర్ణించిన విధము——

సీ. హరి నీలముల కప్పు । లణఁగించు నునుగొప్పు
పిడఁ బువ్వు దండ తా । పీడఁ బాఱ
కోటిచంద్రుల డాలు । గోటమీటఁగఁ జాలు
మొగముఁ గుంకమ చుక్క । సొగసుఁగుల్క
అలజక్క వలజక్కు । లణఁగఁద్రొక్కఁగ నిక్కు
పాలిండ్లపై నాఁచు । పైఁటఁ జాఱ
ఇసుక దిన్నెల మెట్టు । పసిడి చెంపలఁగొట్టు
బిఱుఁదుపై మొలనూలు । బెళుకు దేర
చిగురుఁ గెమ్మోవి బగడంపు । జగియు మెఱయ
మాటలాడఁగఁగనుదోయి । తేట లమరఁ
జెమటలూరంగ సింహాద్రి । చేరవచ్చె
భోగగుణధామ యాంధ్రని । యోగిభామ.

ఉ. వన్నెలగాగరా జిలుఁగు । వట్రువ కుచ్చిళులంసు నాదము
ల్సన్నపు వారిభంగముల । సంబున వీచెడు చాల కూర్మి ము
స్గన్న తెఱుంగుఁ ద్రోఁప కర । కంజములన్ ముసుగుంపిగించి పై
చ్చన్నము ఖాజ్జయై నడచె । సంకుస బొందిలి భామ గోమునన్.

ఒక దాసరికాంత వచ్చుచుండఁ గాంచి——

ఉ. వాసనకల్లు మేలు నిడు । వాలుకనుంగవ గబ్బిగుబ్బలన్
కేసరి మధ్యమున్నదన । కేళికి నింపగు బాహుమూల వి
న్యాసము గల్గినట్టి యెల । నాగను బోగముదానిఁ జేయ కా
దా సరిదానిఁ జేసిన వి । ధాతను నేమనవచ్చు నీశ్వరా ?

కం. బంగారువంటి మేనును
శృంగారము లొల్కు కుల్కు । చిక్కని చన్నుల్
బంగారపు నెఱచీరయు
చెంగటచూపులు నియోగి । చేడియ కొప్పున్.

పవలుచూచిన రాత్రి కలలోనికి వచ్చునట్టి యొకవనిత రూప మునకుఁదోడు మాసినచీరఁ గట్టుకొని వచ్చుచుండగాఁ గాంచి—

చ. పురుషుఁడు గూడువేళఁ బెడ । బుద్ధులు సుద్దులు కానిచేతలున్
సరగున మేనికంపు చెడు । చందపురూపము నేవ్యావస్త్రమున్
బరఁగు నిరంతరంబు నెడఁ । బాయని సౌఖ్యము లేని ప్రేమయున్
విరహపుఁ జూడ్కు లుమ్మలిక । వీసము జెల్లును వైశ్యభామకున్.

“ఓలమ్మ! ఎందే మూతాడవు. ఓలి నీ జిమ్మడ బేగిరాయే. పొద్దెక్కి పోతాది. కూంత బేగిపోయి తానా లాడదారి. అప్పన్న బాబును సూద్దారి బేగిరా. బేగిరా.”

అని పిల్చుచున్న యీఁడ్రవనితను జూచి యేవగించుకొని చెప్పినది.

చ. గురుకుచయుగ్మమూనసము । కోమలికంబులు ముద్దుమాటలున్
అరుపు లతిప్రసంగములు । నప్పట నప్పట మేలుమాట లం
దరితక ళానిధానమున । తాడనపీడన బూతుమాటలం
బరువడి నొందనేర్చుప్రియ । భాషలు గల్గనె యీఁడ్రభామకున్.

ఆ వెనుకనే వచ్చుచున్న నొక శూద్రభామను గాంచి.

ధరంబులు గునా । భావపరివీణత్వము
పరవిందాస్య సుగంధ గంధపటు వే । న్యాత్యంత సౌందర్యము
ద్దురతందారిణ వివేకసంపదయు మా । ధుర్యాది గాంభీర్యమున్
దరుణీరత్నము శూద్రిభామ గుణము । ల్తక్యంబె వర్ణింపగన్.

సీ. మకరధ్వజుని..................

..............చిగురుం బోడి
యుభయ కక్షములందు । నుదు దీర్ఘతరముగా
నెగలు పెంచినదరా । నీలవేణి
పసుపువాసన గ్రమ్మ । పైటచేయ మెత్తు
ముసుగు బెట్టినదయా । ముద్దుగుమ్మ
పూర్ణచంద్రుని గేరు । పోలుపు సింధూరంపు
బొట్టు పెట్టినదయా । పొలతి నుదుట
యెమ్మెమీఱంగ నిత్తడి । సొమ్ము లలర
యోరచూపుల శృంగార । మొలకచుండు
గల్కి యేతెంచె మదనిరా । చిల్కయనగ
వలపులకు పేటి యొ య్యొడ్డె । కులవధూటి.

చ. విటకర భిండివాది హరి । వేదన కోడి నీరజన్మ హా
త్తటనము వ్రాలి పోవగను । తద్దయు బోవగ నాభిగాంచ య
చ్చట పటుదీర్ఘ దండహతి । చాల విరోధమటంచు దెల్పినన్
దటుకున జోక నిల్చిన విధంబున నుండె కుచంబు లింతికిన్.

సాధారణముగా దీర్థములలోనను గొప్పగొప్ప నుత్సవముల లోనను సరుకు లమ్ముటకై సిగ్గు బిడియములు లేని యువతులఁ గూర్చుండఁ బెట్టెదరు. అట్లు కూర్చుండఁ బెట్టుటవలన మామూలుకన్న సరు కెక్కువ కర్చుపడునని వారి యాశయము. అట్లే యీ తిరునాళ్ళ లోఁ గూడ చాల దుకాణములపై స్త్రీలే కూర్చుండి విక్రయించు

చుండిరి. శ్రీనాథుఁడు తమలపాకులు కొనవలయు నై బోయెను. ఆ దుకాణముపై నొక యంగనను జూచి—

చ. తొలకరి మించుఁ దీవగతిఁ / దోప దుకాణము మీఁదనున్న య
య్యలికుల వేణిఁ గోఁ దముల / పాకుల జేరము లాకుఁబోయి నే
వలచుటకేమి? శంకరుని / వంటి మహాత్ముఁడు లింగరూపియై
కలుకుమిటారి గబ్బిచను / గుబ్బల సందున నాట్యమాడఁగన్.

వైశాఖబహుళ అమావాస్యకు సింహాచలములోఁ దిరునాళ్లు జరుగును. ఆకాలములో మామిండ్లు బాగుగా లభ్యమగును. ఆదినమున మామిడిపండ్లమ్ముకొనుచున్న యువతిని జూచి:—

ఉ. అంగడివీథిఁ బల్లవుల / కానగ మామిడిపండు లమ్ముచున్
జంగమువారి చిన్నది పి / సాళితనంబునఁ జూచెఁ బో నిశా
తాంగజబాణకైరవసి / తాంబుజ నుత్తచకోరబాలసా
రంగతటిన్నికాయముల / రంతులు చేసెడు వాలుచూపులన్.

ఆ కాలమున నున్న మిఠాయిదుకాణములలో జాలవఱకు బొందిలివారివే ఇప్పుడుగూడ నక్కడక్కడ బొందిలిదుకాణములు గలవు. అప్పుడొక దుకాణముపై నున్న బొందిలి యువతిం జూచి—

మ. విమలాంభోరుహ పత్త్రజైత్రిములుగాఁ / బెంపారు నేత్రమ్ములన్
గమనీయంబగు కజ్జలంబునిడి రే / ఖా సౌష్టవం బొప్ప నా
గముతోఁ జేసినసింధురంబు నుదుటం / గాన్పింపఁ బయ్యెంటయుం
యము వాత్రైకయు దాఁటిపూపచనులో / య్యారంబు చూపన్ దుకా
ణముపై బొందిలిదోర్తునిల్చె ముఖచం / ద్రస్ఫూర్తి శోభిల్లఁగాన్.

కం. అగసాలిది కాఁబోలును
సొగసైన మిటారి యోర / చూపులతోడన్
జగమెల్లను వలపించుచు
మగటిమితో వచ్చె పురము / మార్గము వెంటన్.

## విప్రభామ.

ఒకనాఁడీతఁడు తన మిత్రునితోఁగూడ సాయంసమయమున వాహ్యాళికై పోవుచుండెను. ఊరివెలుపల నున్న బావినుండి నీళ్లు తెచ్చుకొనుటకై యొక విప్రభామ పోయి నీళ్ళు చేదుకొని బిందె భుజముపైఁ బెట్టుకొని గృహోన్ముఖురాలై పోవుచుండెను. అప్పుడు మన కవిసార్వభౌముని స్నేహితుఁడా భామామణిఁ జూచి వెంటనే తన మిత్రునకుఁ జూపి నోరూరున ట్లేమియో పొగడ నారంభించెను. శ్రీనాథుఁడామెను బాగుగా నవలోకించి యూరక పొగడుచున్న తన మిత్రునిఁ జూచి "ఓయీ! నీ యభిప్రాయము సరిగాదు" అని యిట్లు చెప్పెను.

చ. గురుకుచముల్ బిరీయొక్కులుగ । క్రొమ్ముడియున్నిటలాలకంబులున్
మురిపెపుమాటలున్నగవు । ముద్దుమొగంబును గల్గు కాని యా
సురతపు నేర్పు మాటలును । సూక్ష్మవిభీషణ భాషణంబులన్
బరువడితో విభుం గవయు । భావము బుట్టదు విప్రభామకున్.

తా. ఓయీ! నీవు చెప్పిన స్త్రీ భామామణి సురూపసుందరియే. కాని యీమె చెంత సరసత్వ మున్నట్టుల దోఁపదు. ఆ సమయంబున మాటలాడు నేర్పు గూడ యీమె కున్నటుల దోఁపదు. ఈమె తన మగనితో మాటలాడుటయే యెఱుంగదని నా భావము. అట్టి తెలివి హీనురాలు సరసులమెప్పింపఁ జాలదనుటలో నతిశయోక్తియేమున్నది

## అగసాలి చిన్నది.

వీరిరువురును వాహ్యాళినుండి తిరిగి యింటికి రాఁబోవుచుండ బాటమధ్యనే సూర్యాస్తమయమైనది. అందుచే మిక్కిలి వడివడిగా

వచ్చుచుండిరి ఆప్రాంతమున నెవ్వరును పరులు లేకుండుటచే విచ్చల విడిగా మాటాడుకొనుచు నీళ్ళు చేదుకొనుచున్న యువతీమణులఁ జూచిరి. అప్పుడు మన శ్రీనాథుఁడాయువతులను దన చెలికానికిఁ జూపుచు—

ఉ. తల్లియు కొండపల్లి నొక । తామరఖండికి నీళ్ళ కేగగా
దెల్లని చీరకొంగు నెగ । దీసుక నవ్వుచు నీళ్లు చేదఁగా
గొల్లల లింగకాయ చను । గుబ్బల సందున నాట్యమాడఁగాఁ
జల్లని మాటలాడు నగ । సాలి శిరోమణి సూచితే సఖా!

వీ రయ్యెడనుండి క్రమక్రమముగా గ్రామములోనికి వచ్చిరి. అప్పటి కింకను సందె చీఁకటి బాగుగాఁ గ్రమ్ముకొని యుండలేదు. ఇట్టి తరుణంబున నొక మెలవాగ వీధిలోఁ జాలసుంది పెద్ద లుండుటచేఁ గావలయుఁ దనగృహంబులోనికిఁ బోవుటకు వలనుగాక లోనికిఁ బోవు టెట్లనాయని యాలోచించుచుండె [illegible] కవిసార్వభౌముఁ డా యువతి యవస్థ నింతలోఁ గనిపెట్టినవారు. పాప మా యింటిలోనికిఁ బోవలయుననెడి యాశయముతోఁ దటి వేచియుండెనే గాని వీరిని జూడనే లేదు అంతకంతకుఁ జీఁకటి యతిశయించి పోవుచున్నది. ఎక్కడకుఁ బోయితివని పెద్దలు దండింతురనెడి భయంబు హెచ్చుచ బాపమా బాల కచ్చుబిగించి మిక్కిలి ధైర్యముతో మనురుగోడ దాఁటి లోనికిఁ బోయెను. పాప మట్లు దాఁటుచున్న బాలిక మెడలోని లింగకాయ యా మనురగోడకున్న కొయ్యకుఁ దగుల్కొనెను. ఎట్లో నేర్పుతోఁ దప్పించుకొని యాబాల లోపలఁ బడియెను. అప్పుడు మన శ్రీనాథుఁ డిట్లు చెప్పెను.

ఉ. బంగరు లింగకాయ చను । బంతులమధ్య నటించుచుండఁగాఁ
జెంగులు జాఱ మేల్మొలువ । చీరయు వీడ మదీప్సితంబు లు
ప్పొంగఁగ వామహస్తమునఁ । బొల్పగు నీవినిబట్టి వేడ్కతో
జెంగున గోడదాఁటె నగ । సాలి శిరోమణిఁ జూచితే సఖా!



## వడిసెల

పల్నాటిసీమప్రాంతమున నన్నియు జొన్నచేలే సాధారణముగాఁ గన్పట్టుచుండును. జొన్నవెన్నులు పంటముఖమునకు వచ్చినతరువాత పిట్టలా వెన్నుల వ్రాలి తినివేయకుండ నలువు రైతులు రనవరతము కేకలువైచుచు, డబ్బాలు వాయించుచు, గల్లరి చేయుచుందురు. పిట్టలీచప్పుళ్ళ కెగిరిపోవుచుండును. అట్లు పిట్టల నెగురఁగొట్టకయే యూరకొన్నచో నొక్క జొన్నగింజయైనను క్షేత్రాధికారికిఁ దక్కదు.

ప్రతిరైతును గూడ జొన్నచేలలో నొక్కొక్క మంచె కట్టుదురు. ఈమంచెపై నెవరో యొక రెక్కి నలువైపులఁ జూచి కొంచె మనుమానముగా నున్నవైపునకు "వడిసెల" తో రాళ్ళు విసరి పిట్టలఁ దోలుచుందురు.

ఇన్నివిధములఁ గాపాడుకొనుచున్నను, పంటలోఁ బండ్రెండవ భాగము పిట్టలు తినిపోవుట మాత్రము తప్పదఁట.

మన శ్రీనాథకవిసార్వభౌముఁ డొకనాఁడీ పల్నాటిసీమలో నొక యూరినుండి యింకొక యూరునకుఁ బోవుచు జొన్నచేల మధ్య నుండి పోవలసివచ్చెను.

ఆ సమయమునకు సరిగా నొక రెడ్డికూఁతురు పొలములోనున్న వారి కన్నము దెచ్చి యిచ్చెను. వారన్నము దినుచుండఁగా పిట్టలఁదోలు పని యీమె మీఁద పడినది. ఆ కారణంబున నీమె వడిసెల చేతఁబట్టి మంచె నెక్కుచుండఁగా మనశ్రీనాథుఁడు చూచి యామె సోయగమున కాశ్చర్యపడుచు—

చ. విడిబడినట్టి వేణి యటు । బిఱ్ఱినవ్రాలిన యంతలోన దా
వడిసెల చేతఁబట్టుకొని । వట్రువ గుబ్బలపైఁట జాఱఁగా
సడలవణంకగాఁ బిరుదు । నాట్యము సేయఁగ నీవి వీడఁగా
దొడదొడ మంచెనెక్కె నొక । దొడ్డమిటారపు రెడ్డిబిడ్డహో.

## ఒకపద్యము.



ఈ పద్య మెప్పు డే సందర్భమునఁ జెప్పెనో తెలియదు.

క. నిబ్బరపు కలికి చూపులు
జబ్బించుక లేఁటి పిఱుఁదు । సన్నని నడుమున్
మబ్బుకురు లుబ్బుకుచములు
బిబ్బీలకుఁ గాక గలవె । పృథ్వీస్థలిలోన్.

## భోజనము.



ఈతఁడా పల్నాటిసీమలో నొకరియింట నొకరాత్రి భోజనమున కుండిపోయెను. వీరును జొన్నయన్నమే పెట్టుదురని యీతఁ డిదివఱకే యెఱుంగును గాన నేమియు ననుకొనకుండఁ దినుటకుఁ బ్రారంభించెను. కాని యా జొన్నన్నమైనను పసిగా లేక దానినిండ విస్తుమున్న దఁట. దానికితోడు తొలుత వడ్డించిన యరతులము పచ్చడేగాని మరల మాఱైనను వడ్డింపలేదఁట. పాప మాతఁ డాయన్నము దినలేక.

ఉ. మాఱిరి ముట్టఁగా వెఱతు । ముద్దకు ముద్దకుఁ గూటిలోపలన్
బాతిక పాలు సైకతము । పచ్చడి కొంచెమె యాది యంత్యమున్
జూతమటన్న లేదు మఱి । సున్నముకన్నను మెత్తనన్న మీ
రాతిరిబోలె భోజనము । రాతికి నైనను వచ్చుదైవమా!

ఆ. వె. పూర్వమందు విషము । పుచ్చుకొన్నానని
గర్వపడెద వేల । కాలకంఠ
కొండవీటి సీమ । బండజొన్నకూడు
దిన్న నీదు బయసి । తేటపడును.

## ధైర్యము చెప్పికొనుట.

ఒకనాఁ డితని కిట్టి భోజనమే సంప్రాప్తింపఁగాఁ జేయునది లేక విస్తరిచెంతఁ గూర్చుండి యిట్లు ధైర్యము జెప్పుకొనెను.

సీ. కఠినంపు జొన్నలు । కటుకు కుడుములు సూచి
వక్త్రమా ! భయపడ । వద్దు సుమ్మ
నానారుచుల్ గోరు । నాలుకా నీవేమి
సందేహపడవద్దు । చప్పరింప
ఎన్నఁడు గడిచేయు । నెఱుఁగ నెట్లో యని
కడిహస్తమా ! నీవు । జడియఁబోకు
కమ్మని వాసనల్ । గ్రుక్కున త్రెన్చెడి
గర్భమా ! కుటకుట । కాకయుండు
... ... ... ...
... ... ... ...
వచ్చు బహుధాన్యనామ సం । వత్సరంబు
కాయగూరలు మనకు ని । క్కముగఁ గల్గు.

## నంబిపడుచు.

క. నడినూక లేని యన్నము
వడబోసిన నెయ్యి బుడమ । వగురుఁ బెరుగుఁ
గడిమాడ సేయఁ బెట్టిన
నడగూడెపు నంబిపడుచు । నడిగితి ననుమీ !

# పెదకోమటి వేమారెడ్డి.



క్రీ. శ. 1404 మొదలు 1420 వఱకు 17 సం॥ యీతఁడు రాజ్యపాలన మొనర్చెను. ఈతనికి సర్వజ్ఞ చక్రవర్తి యని బిరుదు గలదు. అమరుశతకవ్యాఖ్యాసాహిత్య చింతామణ్యాదికృతుల కీ ధరణీశ్వరుఁడు కర్త. శ్రీనాథుఁ డీతని రాజ్యములో విద్యాధికారిగా నుండెను. తొలుదొల్త భూపతిని దర్శింపవచ్చినప్పుడు శ్రీనాథుఁడు చెప్పిన పద్యములు.

సీ. కపటకంఠీరవా ! కారణా రాయణ
క్షోణిపాని వాదంబు ! గేలిసేయు
కల్పాంత దుర్దాంత ! కాలభైరవభేరి
డమరుకోన్నాదంబ ! డాఁగఁజేయు
ప్రళయకాలాభీల ! పటుఘోర నిర్ఘాత
పటుపుష్కరావంబుఁ ! జూఁకలపఱుచు
కుహనామహాకాల ! కోలాహలోత్తాల
పాతాళనినదంబు ! భంగపఱుచు
గండుమెఱసిన రిపుకోటి ! గుండెలవియఁ
జండగతి మ్రోయు నీ రణో ! ద్దండభేరి
జయ రమానంగ ! రాయ వే ! శ్యాభుజంగ
యతుల బలధామ! పెదకోమ ! టన్న వేమ.

సీ. కానీనకాకోక ! కానీనకాకోక
కానీనకాకోక ! కాద్రివేమ
కాద్రివేమాధర్మ ! కాద్రివేమాధర్మ
కాద్రివేమాధర్మ ! కాలకాల

కాలకాలప్రాంగ । కాలకాలప్రాంగ
కాలకాలప్రాంగ । కారకార
కారకారగ్రాహ । కారకారగ్రావ
కారకారగ్రాహ । గ్రాహగ్రాహ
గాహగాహను గాహను । కైనదూమ
దూమనాటీక నాటీక । దురభిమాన
రమ్యగుణాలోల ! సంగడి । రతుపాల
యమిత గుణధామ ! పెదకోమ । టన్న వేమ.

చ. ధరణికి బొమ్మరిల్లు వసు । ధావరపంక్తులుబొమ్మ లంబుధిన్
గురుగులు, చక్రవాళగిరి । కోటనభం బది సేసకోర ని
ర్జరగిరి గద్దెపీ టయిన । చంద్రులు మేటినివాళి పళ్ళెముల్
గురుతరపుణ్యుఁడైన పెద । కోమటి వేమన కీర్తికాంతకున్.

## జంగమురాలు.

క. చెవులవి నీలపురాలా !
యువిదరో నిను రతులం దనుప । నొకసితరాలా !
యివి రుద్రాక్షనరాలా !
జవరాల మహాత్మురాల । జంగమురాలా !

## పద్మసాలె మిటారి.

సీ. పడుచేయుచోఁ జూడ । గుడియొకసులయొంకు
సంచరించెడి పైట । సమున్నయములఁ
బోగులుగట్టుచో । బొరుగిండ్ల చిన్నారి
యుపకాంతులకు నుపా । యములఁ దెల్పు

గండొలచుట్టుచోఁ । గన్బొమసైగతో
సొగసుకాండ్రకు డెంకి । చోటుఁజూపు
అచ్చుతేయుచుకుచో । హాస్యరసంబునఁ
జెలికత్తెలను మారు । పలుకరించు
నావలీనలి సతులతో । హాస్యమాడు
మోకు బిగియించుచోఁ బతి । మోసపుచ్చుఁ
గుంచెపిడి పట్టి యాడ్చుచుఁ । గొమను మిగులు
పద్మసాలెది వగఁదేటి । బలుమిటారి.

---

## కాటయవేమారెడ్డి.



ఈ కాటయవేమారెడ్డి కాళిదాస నాటకత్రయమునకు వ్యాఖ్యాన మొనరించెను. కొండవీటిరాజ్యమును గుమారగిరిరెడ్డిచే నేలింపఁజేసినవాఁడు. ఈతఁడు కుమారగిరి బావమఱఁది. కుమారగిరి యవసానకాలమున నీతనికి రాజమహేంద్రవరప్రాంతము బహుమానముగా నొసంగెను. కాటయవేమారెడ్డి నాఁటినుండియు తన దేశమును మిక్కిలి చాకచక్యముతోఁ బాలించుకొనుచుండెను. ఇంతట దైవదుర్విపాకమునఁ బాప మీ కాటయవేముని కుమారుఁడు మరణించెను. పుత్రశోకమునకుఁ గుందికుంది యింకొకరినిఁ బెంచఁ బోన నిష్టము లేక తన యల్లుండగు వీరభద్రారెడ్డి కా రాజ్య మరణముగా నొసంగి యాతనికి బాసటయై యతని జీవితమును వెళ్ళఁజేసుకొనెను.

ఈ కాటయవేమారెడ్డినే మన శ్రీనాథుఁడు "మనుతుల్యుఁ" డని కీర్తించెను.

శ్రీనాథుఁడు రాజమహేంద్రవరము వచ్చి కాటయవేముని కీర్త్యున్నతుల విని యాతని దర్శింపవలయునను నుత్సాహముతో నుండి

యుండి యొట్టకేల కాతనిని దర్శించి యాతనిచే మన్ననలఁ గాంచెను. అప్పు డిట్లు చెప్పెను.

ఉ. మానుష దాన మాన బల । మానితధర్మ రమామనోజ్ఞరే
ఖాచితభూతి విత్తములఁ । గాటయవేమునఁ బోల్తు వాసవిన్
వాని విరోధి వాని విభు । వాని విపక్షుని వాని యగ్రజున్
వాని మఱంది వాని సుతు । వాని యమిత్రుని వాని మిత్రునిన్.

అర్థము. మానుష = పౌరుషము - దానము = దానమునకు - మానము = శౌర్యమునకు - బల = బలమునకు - మానితధర్మము = ప్రసిద్ధిగల ధర్మమునకు - రమా = స్త్రీలకు - మనోజ్ఞరేఖా = మనోలావణ్యమునకు - నుతభూతి = ఐశ్వర్యములకు - విత్తముల = ధనమునకు

కాటయవేమును బోల్చిచెప్పెదను. ఈతఁడు

మానుషమునకు = మహేంద్రుఁడు.

దానమునకు = కర్ణుఁడు (కర్ణుఁ డర్జునునకు విరోధిగావున మహేంద్రునకును విరోధియే)

మానమునకు = దుర్యోధనుఁడు = (కర్ణుని విభుఁడు)

బలమునకు = దుర్యోధనుని విరోధియైన భీముఁడు.

మానితధర్మమున = భీముని యన్నయైన ధర్మరాజు.

రమా = స్త్రీలకు = ధర్మరాజు మఱఁదియైన శ్రీకృష్ణుఁడు.

మనోలావణ్యమునకు = శ్రీకృష్ణుకుమారుఁడగు మన్మథుఁడు.

నుతభూతికి = మన్మథుని ప్రబలశత్రువైన శంకరుఁడు.

ధనమునకు = శంకరు మిత్రరత్నమైన కుబేరుఁడు.

# శ్రీనాథుని నిర్యాణము

వీరభద్రారెడ్డి గతించిన పిదప కొన్ని సంవత్సరము లెట్లో కాలము గడిపి యించుమించుగా 1453 సం॥ ప్రాంతమున దివం బలంకరించెను.

ఈతఁడు చనిపోవుటకు ముందీక్రింది పద్యమును జెప్పుకొనె నని వాడుకగా నున్నది.

సీ. కాశికా విశ్వేశుఁ । గలసె వీరారెడ్డి
 రత్నాంబరములనే । రాయఁ డిచ్చు
రంభఁ గూడెఁ దెనుంగు । రాయ రాహుత్తుండు
 కస్తూరి కేరాజు । ప్రస్తుతించు
స్వర్గస్థుఁ డయ్యె వి । స్సన మంత్రి మఱి హేమ
 పాత్రాన్న మెవ్వాని । పంక్తి గలుగు
కైలాసగిరి పండె । మైలారువిభుఁ డేగి
 దినవెచ్చ మేరాజు । దీర్పఁ గలఁడు
భాస్కరుఁ డున్న దేవుని । పాలి కరిగె
కలియుగంబున నిఁక నుండఁ । గష్ట మరయ
దివిజ కవివరు గుండియల్ । దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ । డమర పురికి.

ఇంక నీ కవిసార్వభౌమునిచే రచింపఁ బడిన గ్రంథములనుండి రసవత్తరములైన కొన్ని పద్యరత్నముల నుదాహరించెద.

శృంగార నైషధము—

సీ. తపనీయ దండైక । ధవళాత పత్రశ్రీ
 దండ తేజః కీర్తి । మండలుండు

నిర్మించి నిజకథా । నిమిష కల్లోలిని
క్షాళితాఖిల జగ । త్కల్మషుండు
వితతనవద్వయు । ద్వీపవానాజయు
శ్రీనగసూతికీ నమా । శ్లిష్ట భుజుఁడు
నిఖిల విద్యావటీ । నృత్యరంగస్థలా
యితనాయమానజి । హ్వాంచలుండు
ప్రస్తుతింపఁగఁ దగనతఁడు । దృప్త కఠోర
దటుల గుణటంకృతియాఘన । స్తనితఘోషు
చాపసీరద భవశరా । చార సమితి
బలవదహిత తేజోదహా । నలుఁడు నలుఁడు.

ఉ. కొండని వేశ్యలతోఁ బసిఁడి । కొండ ధనార్థుల కెల్లఁ బాచియీ
కుండుట దానధారకుఁ బ । యోనిధులెల్ల వ్యయింపలేము యీ
కొండపకీర్తులందల ధ । రించినవాఁడు ప్రదానశీలుఁ డా
తం డిగువాయుగా ముడికిఁ । దార్చిన పెంపులకెల్ల నిమ్మంబునన్.

తే. గీ. వాసిఁ గలలోనఁ గానని । వనజ ముఖియు,
వాని మార్పునఁ బోల్కని । మానవతియు
వానిఁగా నాత్మభావించి । వరుని గవయ
నప్పళింపని సతియు, లే । దమ్మ యెచట.

తే. గీ. సౌరభము లేని యట్టి పు । ష్పంబువోలె,
గంధుఁ గోయిల పెనిమైన । కానవోలె
నధిప దమయంతి కోడి స । ఖ్యంబు లేని
నీదు సౌందర్య విభవంబు । నిష్ఫలంబు.

ఉ. కాలాంతః పుర కామినీ కుచతటీ । కస్తూరికా సౌరభ
శ్రీలుంఠాకము చందనాచల తట । శ్రీఖండ సంవేష్టిత్ర

వ్యాస్వారఫణాకఠోరవిష ని । శ్వాసాగ్ని వాణింధనం
బేలా నాపయి దక్షిణా నిలము ప । క్షీ సేయు దాక్షిణ్యముల్.

తే. గీ. కనక శైలంబు డిగ్గి యా । కాశసింధు
సలిలములఁ దోఁగి మిగులంగఁ । జల్లనైన
చారు హాటక మయుగరు । చ్చామరముల
వీతు నతనికి వైశాఖ । వేళలందు.

తే. గీ. అతఁడు శుద్ధాంతగతుఁ డైన । యపుడు నీవు
నాప్రిసంగంబు సేత వి । న్ననువు గాదు
భామినీ ముఖ దాక్షిణ్య । బలము కలిమి
నితర కాంత నిషేధించు । నెవ్వఁడైన.

చ. మదనుఁడు రేఁడు చేతుఁను । మాఁప్రడ సేయు ఁగఁ దూప్రులైఁనను
బదియును వేఁయు వేఁయు పరి । పాటినవస్థలు సంఘటింపఁగాఁ
దుదిదశ రాజునందుఁ దగఁ । దోఁచుచున్నది యోనవచ్చుచో
నదిచిగురాకుఁబోఁడియఁట ! । నంబరపుష్పవికాస మయ్యెడిన్.

తే. గీ. విరహ భారంబుతోన యు । ర్వీధవుండు
ప్రిబలమగు దేవకార్య భా । రము ధరించె
నార్వ శిఖతోన జ । ంచె । యంబుపూర
మార్వశేయు డు ధరయిు పఁ । డయ్యె నెల్లు.

ఉ. చంచలనేత్రి మేని నునుఁ । జాయకుసాటి రానునర్పఁగాఁదగుఁ
గాంచన కేతకీ కుసుమ । గర్భదళంబులు ధూళిబ్రింగవే
నంచితభీతి నీ సరసి । జాక్షి తనుద్యుతి కోడి గాదె సే
వించెను వారిమర్గ మర । విందవరాటక చక్రివాళముల్.

సీ. నిబిడ శైశవయావ । నీయ సంధ్యావేళ
యానన చంద్రబిం । బామృతంబు

లవనామృతాంశుకళా । లవిభాషాలంబు
బంధుజీవ లతాంత । బాంధవంబు
పరిపక్వబింబికా । ఫలవిడంబన ముద్రి
విద్రుమ ద్రుమలతా । వినిమయంబు
మదననారాచ కో । మలహైంగుళచ్ఛాయ
యచ్ఛన్నసోమరా । గాంకురంబు
మహితలావణ్యగుణజా ను । మానబహుళ
మాధురీచిత్రశోభా స । మన్వితంబు
ప్రార్థనాకల్పపాదప । ప్రాజ్యఫలము
తియ్యపూఁదేనియల కోవి । దీనిమోవి

శివరాత్రిమహాత్మ్యము:—ఈ గ్రంథరాజమును "ఆంధ్రసాహిత్య పరిషత్తు" వారు సంపాదించి కొలదికాలము క్రిందటనే ప్రకటించిరి. గ్రంథములో కొన్నికొన్ని భాగములు శిథిలమైనవి. ఈగ్రంథమెప్పుడు రచించెనో నిర్ణయించుట కాధారములు గానరావు. పలువురు పలువిధములుగా జెప్పుచున్నారు ఇందలి శైలి గమనించుడు.

సీ. హృదయ మువ్విళ్ళూర । నేకాంతమునయుండి
వాని చింతింపని । వనజముఖియు
నొకమాఱు రతిని జూచి । యొండొకమఱిఁజూడ
నభిలషింపని విద్రు । మాధరియును
కలలోనవానిఁ జ । క్కఁగ కౌఁగిట జేర్చి
ముకుళితేక్షణ గాని । ముద్దియయును
నతనిరూపంబుఁ గు । డ్యంబులందాలిఖించి
యందంబుఁజూడని । యంగనయును

గీ. చెలులచేతను బోధిరా । చిలుకచేత
వానిగుణములు వినియుఁ గు । ద్వాంద్వసీమ

భావకోఁ బులకింపని । పైదలి యుఁగు
బన్నిదము వేసినను లేను । పట్టణమున.

ఈపద్యమును నైషధమందలి "వాసిగలఁగోనగాని వనజముఖియు" అను పద్యార్థము ననుసరించి విస్తరించి వ్రాసియున్నాడు.

సీ. ద్యూతకేళియె వినో । దోపాయమయ్యెను
బరదారగమనంబు । ప్రౌఢియయ్యె
ఆత్మభార్యాపరి । త్యాగంబు ధృతియయ్యె
శేలవిహారంబు । శ్రేయమయ్యె
గురుతిరస్కారంబు । గరిమ మనుటయయ్యె
విటకీర్తనంబులు । పటిమమయ్యె
జ్ఞానంబె యధ్యాత్మ । పరతమయ్యె సమస్త
తరలతాగతియు యు । త్సాహమయ్యె
గుణములకునెల్ల దోషంబు । గుణమునయ్యె
నఘుఁడు సుకుమారునకు దద్వ । యస్యులకును
నాదిగర్భేశ్వరత్వంబు । యౌవనంబు
నఘురు ధనమును జనపుహే । తువులు గాఁగ.

మ. బహువేదాంతమతానుసాధితమహా । బ్రహ్మానుభావుకుర్
మహిమోహాంధులు గొందఱేని యిఁకఁబ్రా । హ్మంబెట్టుదారెట్టిరో
యహహా బ్రహ్మము వారయేనులుగదా । య్యాంపెళ్ళి నిద్రింతురో
జహాత్సర్గము గాఁగఁజేయుదురొ వి । ష్టామూత్రనిర్మోక్షముల్.

మ. వసుధాసర్జరుఁడు స్మహాసరసిలో । వార్ధ్రీనులందేలెఁ దా
వెసుధాసన్నిభమైన వారిఁ దటపు । ష్పీజావళిచ్ఛాయలో
వసియించె లహరీసమీరముల న । వ్యశ్రాంతి పోకార్చి పెం
బిసకాండంబులు మేసఁగూరెఁ జలువ । ల్మిర్గోత్కసంకాశముల్.

శా. బింబోష్ఠీకుచకుంభభారము లురః । పీఠంబులన్ హత్తి మో
దంబార న్మృదుకేళిశయ్యల శుభాం । తర్గర్భగేహంబులం
దంబోలీదళభాగపూరితముఖుల్ । దన్యాత్మరుల్యైతకా
లంబెంతేనియు నిద్రవోదురు నిశల్ । సంభోగలీలావధిన్.

ఉ. ఎట్టుగ నేగుదెంచితిరి । యిందుకళాధరభృత్యులార యీ
చెట్టమరాత్మునిన్ హరుని । జెంతకునుం గొని పోవువారలై
యెట్టొకొ శంకరుం డొకని । నెవ్వని నేఁ గొని తేరఁబంపెనం
బట్టగవచ్చినారొ తడ । బాటున నీని మతిభ్రమంబునన్.

ఉ. బుద్ధియ కల్గెనేని కొని । పోకుఁడు ధర్మము సూక్ష్మ వినాయసం
బద్ధములైన న్యాయములఁ । బాతము వచ్చునె మేము తెంపుమై
యుద్ధము జేయఁజాలకయ । యోహరిసాహరి యెంత జెప్పిన
న్నిద్ధరశీతలామరుని । నీరుచలంబున మీరఁ దక్కనే.

తే. గీ. పరమమునులు సూత్యాహసం । భవుని సూతు
భక్తి పూజించి యధికతా । త్పర్యమొప్ప
భటులు ప్రమథులచే భంగ । పడుటఁజూచి
చిన్నవోయి యమునుం జేమి । చేసె పిదప.

అనిడి యాశ్వాసాంతపద్యమువలన యింకను కొంతకథ మిగిలి యున్నట్లు తోఁచుచున్నది.

కాశీఖండము:—

సీ. ప్రాణేశుఁ డారగిం । పక భుజియింపదు
నిద్రింపక యమున్న । నిదురవోవు
నాథుండు మేలుకొ । నకమున్న మేల్కాంతు
లైసేయు కొన్నఁడుఁ । గవయ పథిపు
ధవుఁడు పోషితుడైన । తలిరవాఁడి యుండుదు
పలికి నెప్పుడు మారు । బలుకదీవు

పురుషునిగికి నల్ప । మనక సంతోషించు
మొగమెత్తి నేరవు । మగని యెదురఁ
జెరఁగుమాసిన మూన్నాళ్ళు । సిగ్గుతోడఁ
బతివిలోకనమార్గంబు । పరిహరించి
సవిత్రుఁ డుదయింప నన్నాళ్ళు । జలకమాడి
చూడ వెవ్వారి, పురుషుని । జూచి కాని.

మ. పసుపుం గుంకుమకజ్జలంబులు చుగూ । ర్పాసంబుతాంబూలమున్
గుసుమంబుల్ కబరీభరంబు జెవియా । కుల్ మంగళాలంకృతుల్
విసువొక్కింతయు లేక తాల్పవలయున్ । వీనిన్ సదాకాలము
న్నసిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై । నాళీకపత్రాక్షికిన్.

కం. నాగరికత్వము వాచా
పాగల్భ్యము జూపఁజనదు । పతిముందట సం
భోగక్రీడావిభవో
ద్యోగంబులఁ దక్క సతికి । నుత్పలశయనా !

వ. కొందఱు కులటలు పతిదురవస్థఁ బొందినఁ దెవులుపడిన శృంఖలాబద్ధుండైనను పరిత్యజింతురు. కొందఱు దుష్టమతులు లేమిఁ గుందువడిన భర్త నధికకార్పణ్యంబు వచించి సర్పిర్లవణతైలతండులాదులకై సిబ్బితపఱతురు. కొంద ఱిచ్ఛావతులు ప్రియుండు తమకు నేమియిచ్చిన మెచ్చక హెచ్చుకుందాడుదురు. కొందఱు వరాకతేశాకినులై మగని మొఱఁగి యెక్కడికేనిం బోదురు. కొందఱు దుశ్శీల లశ్లీలవాక్యముల నందంసఁ బ్రియునిముందట మందమేలంబునం బ్రోలుదురు. ఇందఱు నాథునిం గులంబువారిని నరకంబునం ద్రోచి తారును సంద కూలుదురు.

సీ. చీఁకటి తప్పుచే । సిన సరోరుహాక్షి
గూబయై వసియించుఁ । గోటరమున

వింతవానిఁ గటాక్ష । వీక్షణంబులఁ జూచుఁ
గినలయోష్ఠి వహించు । గిల్లకన్న
మగడు తన్మొత్తిన । మార్మొత్తునలివేణి
వ్యాఘ్రియై జన్మించు । వనములోనఁ
జఱితిండి తనవారి । మొఱఁగి నాహారించు
నతివ సూకరజాతి । యందుఁబుట్టు
తే. గీ నధిపుఁ గోపించి హుంకార । మాచరించు
పడఁతి మూగౌను, సవతి సౌ । భాగ్యలక్ష్మిఁ
జూడఁజాలక మదిలోన । సూయసేయు
భామ దుర్భగ మగునన్య । భవమునందు.

ఉ. దూరముపోయి యొండపడి । దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహాళుల । దాక నెదుర్కొని తీర్థమార్చి యా
హారము పెట్టి పీడ్యము న । మర్పణఁ జేసి విహారశయ్యపై
సూనుచ్రలొత్తి చిత్తమున । సంబ్బానరించుట ధర్మ మింతికిన్.

తే గీ. తగవుపాటించి యల్పంబు । తండ్రి యిచ్చు
నల్పమల్పంబు భ్రాతయు । నాత్మజుండు
ప్రార్థితంబైన ధన మన । ల్పముగ నిచ్చు
ప్రాణనాథుని సరియె యే । బంధువులును.

తే. గీ. ఎన్నికకు రోమకూపంబు । లెన్నిగలవు
దివ్యవర్షంబు లన్ని మో । దించు సాధ్వి
నాకభువనమునం దాత్మ । నాథుఁ గూడి
వెఱప్రాకింతయు లేక చి । చ్చ్రతికి నేని.

సీ. భాగీరథీస్నాన । పరతఁ బోలంగ తే
దామ్నాయశాస్త్రాగ । మాధ్యయనము

వాలాయమును గనో । వాక్కాయ దురితాళి
విదళించు గంగాభి । షేకరాంబు
శ్రీకంఠు కృప లేక । సిద్ధింప నేరదు
త్రిదశగంగానదీ । తీర వసతి
బ్రహ్మవిజ్ఞానసం । పత్ప్రాప్తి హేతువు
జహ్నుకన్యాసింధు । సలిలసేవ

తే. గీ. కలియుగంబునఁ గలుషచి । త్తులకు శివుల
కన్యవిత్తాపహర్తల । కనియతులకు
యాత్మయందుఁ బ్రాయశ్చిత్త । మాచరింప
కాంక్షగలయప్డు నరునకు । గంగ దిక్కు.

సీ. దండు నేపీట మా । ర్కండేయ మునినాథ
సజ్జలింగ మనంగ । శాసనుండు
ప్రవహించు నేపీటి । పశ్చిమ ప్రాకార
మొరసి గంగమ్మ సా । గరము కొమ్మ
యావిర్భవించినా । డేపీటికోటలో
బలభేది వదనగో । పాలమూర్తి
పాలించు నేపీటి । ప్రాగుదక్కోణంబు
నుమబోటి శ్రీమల్ల । నూరిశక్తి
ప్రబలధారాసురత్రాణ । భద్రిజాతి
కరిఘటాసైన దుస్సాధ । కనకలోహ
గోపురద్వారకవాటప్ర । దీపితమతి
సాంద్రవిభవంబు రాజమ । హేంద్రవరము.

శృంగార శ్రీనాథమను రసికాభిలాషము:—

ఇయ్యది శ్రీసెట్టి లక్ష్మీనరసింహముగారిచేఁ బ్రకటింపఁబడెను. ఇయ్యది శ్రీనాథకవిసార్వభౌమునిచే రచింపబడియుండ లేదని కొంద ఱభి

ప్రియమడిరి. ఇంకలి శైలి చూపుటకు కొన్ని పద్యములఁ గూడ నీ
క్రిందఁ బొందుపఱచెద.

చ. మదను ధనుర్గుణంబు పయి । మార్గణపాళి పయిన్ ధనుస్సుపై
మది నుదయించు నామువగ । మానక నంగజసంగరంబున
న్మదవతి నీకు కొప్పాడిచి । నీటికిఁ బట్టుకొనంగ నీయెడ
ల్పదిగనలంచు నీపికవి । బంబను సారెను నొక్కఁగొంకితిన్.

ఉ. కాముఁడు నాపునస్థలిని । గల్గిన ధైర్యధనంబు నెల్ల నో
కోమలి దొంగిలించి యిఁక । కుంజరుకొండల నొందునందు దా
నీమెయిఁ బాతిపెట్టెనుగ । చే నను జూచుకొనంగ నీయుమా
సీమను సంశయస్థలులఁ । జేకుఁ గుమ్మెన గోళ్ళఁ ద్రవ్వెనన్.

చక్రబంధము.

శా. కన్యాశృంగి సమాన బాధుర కుచా । కల్యాణ సుశ్రీ రమా
ధన్యా గాన కళా ధురంధర కళా । తంత్రీ సమాపాద రా
జన్యా రమ్యద చైత్రి సుందర కటా । తా యధ్రిమే ధర్మయా
మాన్యాత్మా కమబాధకర్త జరవే । మాటల్ దయన్ జూపుమా.

భీమఖండము:—

ఉ. జామునజామురంచు మృదు । వచ్చలు గీతులు వారుణీరసా
స్వాద మహాతిరేకమున । జంద్రిక గాయఁగ దక్షవాటిలో
వీథుల వీథులంగనగ । వీణలు మీటుచు పాడి రచ్చరల్
మోదమెలర్పఁగా భువన । మోహనవిగ్రహు భీమనాథునిన్.

శా. తల్లీ యిన్నిదినాల కేంయు సుధా । ధారాలవస్యందియై
యుల్లంబుం దనియింపఁ జేయు పలుకె । ట్లో వింటి నిప్పింటిలోఁ
బెల్లాకొన్నకతాన నే నొకఁడ నే । భిక్షానకు స్వత్తునో
యెల్లన్ శిష్యులఁగొంచు వత్తును నిజం । బేర్పాటుగాఁ బల్కుమా.

చ. మగటిమిఁ జంద్రుని గుద్దరక । మంటిన వామపదాంబుజంబునై
నిగళమున న్సురాసురులు । నిందినయందము ఘుష్కృణుల్యనం
బొగడలు బొండుమల్లియలు । పొన్నలు పొగడ నెల్లియంబున
న్నిగిడిచి వీరభద్రుఁడు చ । నెన్ శశిమాళి సమీపభూమికిన్.

ఉ. వాలిక చూపుఁ గుత్తవన । బర్హికిశోరపులాస్యలీలపై
వ్రాలిచి పచ్చకప్పురపు । వాసన త్రోడి ముఖారవిందతాం
బూలము మోవి మోవి పయి । మోపుచు రాధిక కిచ్చుధూర్తగో
పాలుఁడు బ్రోచుఁగావుత న । పారకృపామతి మంత్రియన్ననిన్.

మ. ఎవరయం గల్గిం గూర్మి బృంగిరిటిఁగా । నీతండుఁగాని నికుంభి
భిరిగా నీకయిదండపట్టుకొని నం । భోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్న మొఱంగి యుప్పరమునం । గాదారి మాదారి ప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ । ధూర్తప్రకారంబునన్.

గీ. కాలకూటోప సంహార । కారి యతఁడు
త్రిపుర దైత్యాధిపతుల మ । ర్దించె నతఁడు
నిగ్రహానుగ్రహ ప్రౌఢి । నెపుడు నతఁడు
సంతతము దేవతేశ్వర । జగుఁ డతఁడు.

క. చెంచెమలచూర [illegible]
కంచిత బాహాపరాక్రి । మాధామనకున్
పంచారామవసూటీ
పంచాస్త్రవిహారకేళి । పంచాస్త్రనకున్.

శా. రక్షోనాయకులార నిర్జరవర । వ్రాతంబు చేతన్ సుధా
భిక్షాపాత్రము వోయెనంచు మదిలో । బెగ్గిల్లఁగా నేటికిన్
రక్షార్థంబు భజింపరావె యధవా । త్రైలోక్య కుక్షింభరుం
దక్షారామపురాధినాథుని సుధా । ధామార్ధచూడామణిన్.

గీ. పుర్వ్వ ముడచిన పురవీధి । భూమియందు
గట్టె మోహంగవఁ బెస । కారణమున
వీరభద్రునిచే దైన్య । వృత్తినొందె
దత్తుఁ డట్టి మహాద్వార । స్థానమునను.

పల్నాటి వీరచరిత్రము:—

ద్వి. పేరె బాలుఁడు గాఁడు । బిరుదుమగండఁ
బగవారిఁ గొట్టవి । బాల్యమేమి
తల్లిదండ్రులఁ బ్రోవ । దనయుండె కర్త
మానాభిమానముల్ । మగటిమి నించఁ
బ్రబలింపఁ గలవారు । బాలురె సుమ్మ
బాలురె పెద్దలు । బల్లిదు ల్వారె
బాలురకే బుద్ధి । పరికించి చూడఁ
బెద్దలు మతిచెడి । పిఱికిపాఱుదురు
పాంచభౌతికదేహ । పటిమ క్షీణించు
ధైర్యంబు తగ్గును । త్సాహంబు లుడుగు
వయసు మీఱిన వేళ । వచ్చునా బలిమి
కీర్తి కైనను నష్ట । కీర్తికి నైన
బాలురపై నుండు । భారమంతయును.

* * * *

ద్వి. నినుఁ బాసి భువిమీఁద । నిల్వనోపుదునె
వనజాక్షి నీవెంట । వత్తు మటంచు
నరి బ్రహ్మపుత్రుఁడు । నీవిధి యనుచుఁ
గరిమూన లిరువంకఁ । గదిసి చల్లగను
భామలందఱుఁ గూడి । పలుదెఱంగులను
గోమలి చరణంబు । కొంత గైసేయఁ

జలికి కప్పినమూర్ఛ । తెలిసి శీఘ్రముగఁ
దలవంచి తన కాలు । తప్పక చూచి
యిది యేమి బంగరం । బింతచక్కనిది
యిది యెవ్వరిదె యమ్మ । యీప్రల నోడి...

హరవిలాసము:—

ఈ హరవిలాసము వివిధగ్రంథములనుండి సంగ్రహింపఁ బడిన యైదు కథలచే విలసిల్లుచున్నయది 1 చిరుతొండనంబిచరిత్రము 2 గౌరీకళ్యాణము. 3 దారుకావనస్త్రీప్రవకథనము. 4 హాలాహల గ్రహణము. 5 కిరాతార్జునీయము. గౌరీకళ్యాణమును మహాకవి కాళిదాసుచే రచింపఁబడిన కుమారసంభవ మను సంస్కృత కావ్యమునుండి గ్రహించి యందలి శ్లోకముల నాంధ్రీకరించియుండును.

శ్లో॥ తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ
నినిందరూపం హృదయేన పార్వతీ
ప్రియేషు సౌభాగ్య ఫలాహిచారుతా॥

యను శ్లోకము నాంధ్రీకరించియున్నాడు.

గీ. అక్షివహ్నింబునఁ దనమ్రోల । నసమ శరుఁడు
తనకుఁగా నీశ్వరునిచేత । దగ్ధమైన
ధరణిధరకన్య నిందించెఁ । దనసురూపుఁ
బతులు మెచ్చని రూపు వి । ఫలము గాదె.

ఉ. పల్లవపుష్ప బాగములు । పాదసరోరుహ యుగ్మకంబుతోఁ
జల్లి శ్రవోవతంసమగు । సంపగి మొగ్గ నొకింత జాఱఁగా
నల్లన మ్రొక్కెఁ బార్వతి భ । యంబును భక్తియు సంభ్రమంబునం
దల్లఁగ భర్తకున్ ఘన భ । ని ప్రభుహారున కంధకారికిన్.

ఉ. జోటున వర్షముల్ గురిసియు । సుక్షితుఁడా చిరుతొండనంబి దై
వాఱను భక్తిపెట్టు శివ । భక్తులకర్థి జతుర్విధాన్నముల్
తాఱఁ మెల్ప పప్పుడు ఘృ । తంబును తీయని పానకంబులున్
జాబులు పిండివంటలును । శర్కరయున్ దధియున్ యథేచ్ఛగన్.

శాసనము.

కోమటివేముని భార్యయైన సూరమాంబ త్రవ్వించిన సంతాన సాగర మను తటాక ప్రతిష్ఠావసర సమయమున శ్రీనాథుఁడు రచించిన శాసనము.

శ్లో. కల్యాణం జగతాంతనోతు సవిభుః కాదంబినీ మేచకః
క్రీడాక్రోడ తనుః క యోధపయసో విశ్వంధరా ముద్వహన్
భారాపేత ఫణావిన్తనవశా న్నోదాయయుశ్యాభవన్
నిర్వృత్తా భుజగేంద్రమౌళి మణిభి క్ష్మారాజన ప్రక్రియా
తమోపహారే తాంతనవ్యవంతౌ రాకాసుధాంశ్వాపరంశై భాస్వ
రధ్యాంగ లీలా విపదర్శయంతౌ పురాపురారేః పృథివీరథస్య
వానప్రాకార కివిన్యాస్తం బేరమసపుర్నహ·
ఉన్నిద్రియత్ భద్రాణి రుద్రాణీ యేనసుప్రజాః
యక్ష్మాలోనిహితం చిరాయునిగ మైర్ధ్యేయం చెయుద్యోగభిః
ర్యళ్ళక్ష్మీన్నృపాణి పద్మయుగళీ సంవాహనైర్లాలితం
జాతాయత్ర వియన్నదీతిజగతీ సంతాపనిర్వాపణీ
తస్మాత్ కంసభిదః కదాద దభవద్వర్ణగణోర్ణోనిధిః
తత్రాభవ స్త్రప్రసత్త మ చక్రవర్తి వేమక్షితీశోజగరక్షపాలః
యేకాదశీభిప్రతిభాతిశంకా యేనావతారాః పరమస్యపుంసః
రాజ్యం వేమసచిఃమకరో త్ప్రాజ్యదానైకతానో
భూమీదేవైర్ద్విమనుర భుజో భుక్త శేషామబిజ్ఞ
శ్రీశైలాగ్రత్రిపథగతి పధిపాత్త పాతాళగంగే

సోపానాని ప్రమథ పదవీమారురుక్షుశ్చకార
మాచక్షోణిపతిర్మహేంద్రమహిమా వేమక్షితీశాగ్రజో
రామాద్యైః సదృశోథ భూవసుగుణైస్త స్యాత్రయోనందనాః
కీర్త్యాజాగ్రతి రెడ్డిపోతనృపతిః శ్రీకోమటీంద్రస్తతో
నాగక్షోమపతిరిత్యుపాత్తవపుషో ధర్మార్థకామా ఇవ
ఆసూతపుత్రం పెదకోమటీంద్రో విశ్రాణనైః కర్ణమసూతపుత్రం
వేమాభిధానం గుణనైకతానం పాథోధిరత్నాధసవౌషధీనాం
ధాటీమందభిభాకృతింకలయతో నిర్ఘాతరావ రిపూన్
నామాని ప్రీతమర్జునస్య జపతో యస్యాజిగాండీవినః
సంగ్రామోపపదాఃకృతాని భవతాం రక్షాకృతే సర్వదా
వర్ణ్యంతామితిభోద యంత్యధిపతిన్ ధియున్ త్రినోమంత్రిణః
శ్రీశైలే స్థిరమూఃకతాఃసుపగతా వృద్ధిం కుమారాచలే
పంచారామతలే ప్రతానవసూః సింహాచలేంద్రే తతః
శ్రీకూర్మే పురుషోత్తమే చ సుమితా యద్ధర్మకీర్త్యోర్లతా
కళ్యాణివిశ్వపతేః పురఃఫలవతీ నిత్యోపహారోచితం
అభిమన్యుకరగ్రాహ్యా ముత్తరా ఖడ్గపుత్రికాం
నర్తయత్యాహవే రంగేయుః సంగ్రామధనంజయః
ఆశ్రాంతం గృహరాజ సౌధనిల్లక్షికరాభ్యంతర
క్రీడాంభోరుహతాలవృంతనటనప్రస్తావవిస్తారితః
వాయుః కేశరవాసనాసురభితో యస్యార్థి చింతామణే
రద్ధాంగీచామరదానకేళిజనితం స్వేదాలఘసాంజాలకం
సప్తసంతానవత్యాసిద్ధ్యేన సర్వాసహేత్యలం
స్పర్ధయేవద్భుతాః కీర్త్యాగ్రేభిలోకాశ్చతుర్దశ
రక్షిత్రస్యమహాదేవీ రజమాళీ రమాంచికా
రత్నసింహాసనస్యాత్రే రాజతే సూరమాంబికా

శాకాబ్దేశశి రామరామధరణీ సంఖ్యే పరోధ్యాహ్వయే
వర్షేఫాల్గునమాసి బహుళద్వితీయాదిథౌ
దేవీ పెదకోమటీశ్వరభువః శ్రీవేమపృథ్వీపతేః
శ్రీసంతానపయోనిధేః కృతవతీసమ్యక్ప్రతిష్ఠాం ధియా
లీలాపీతతరంగ శీకరకణాం రాకావిధాంతంకుణా
హేరంబేణమదోష్మశాంతివిధయే హేలావగాహం ముహుః
రాజీవాననరథ్యహాంసపరిష చ్చంచూపుటీచరిత
స్వచ్ఛాంభోజ మృణాళకాకినలయచ్ఛేదం మదీయం పయః
ఘోంటాంకరకక్రోరగర్భకుహళీ పాళీవధూళీంస
స్రోతస్స్ఫారఘటీః మానమద లిడ్ఝంకారకోలాహలైః
వాచాలానివనాని యస్యవిధే సోయంసుదానిర్మలే
శ్రీసంతానసముద్ర ఏషపయసాం రాశిర్జయత్యష్టమః
వైడూర్యరత్నశకలామలవారిపూరే
మంక్తులకిమత్రి భగవాన్మధుకైటభారిః
అంగీచకార గజతామవనచ్ఛలేన
పాఠీనకచ్ఛపవరాహమహావతారాన్
దేవామనుష్యాః పితరోగంధర్వోరగరాక్షసాః
స్థావరాణిచభూతాని సంశ్రయంతిజలాశయాం
తటాకేయస్యగావస్తు పిబంతితృషితాజలం
మృగపక్షిమనుష్యాశ్చ సోశ్వమేధఫలం లభేత్
ఆస్ఫోటయంతిపితరం ప్రనృత్యంతి పితామహాః
అపినస్సకులే జాతోయస్తటాకం కరిష్యతి
విద్యాధికారీ శ్రీనాథో వీర శ్రీవేమభూపతేః
అకరోదాకరోవాచాం నిర్మాణం ధర్మశాసనం.

సీ. శాకాబ్దములు సహ । స్రమును మున్నూట ము
    ప్పది యొక్కటును నైన । భవ్యసంఖ్య
వరలు విరోధి సం । వత్సరంబున ఫాల్గు
    నంబున బహుళప । క్షంబు విదియ
శుక్రవారంబున । శుభముహూర్తంబున
    శ్రీధాన్యకటీపు । రాధిపతియుఁ
గృష్ణవేణ్ణా జల । క్రీడావినోదుండు
    పనుఁగన్న భూపాలు । ననుఁగుఁబుత్రి
వీరనారాయణుండు వేమ । విభుని దేవి
భూరిసద్గుణ సిరుదుంబ । సూరమాంబ
జగము వినుతింప సంతాన । సాగరాఖ్య
వరతటాకప్రతిష్ఠోత్స । వం బొనర్చె.

సీ. జాహ్నవీయమునాది । సకలపావన నదీ
    విమల తీర్థాంబుః ప । విత్రితంబు
సవిధ దేశస్థాయి । శివమహాళి బాలేందు
    కాంతిసంఫుల్ల । కైరవంబు
బహులమహాపరివాహ । పానోద్ధగద్ఘన
    ఘుమఘుమాయిత దిశా । గోళకంబు
జలసారణీసేక । సంవర్ధితానేక
    వనవిసీతాఢ్యారా । ద్వ్యశ్రమంబు
బలవదురుమత్స్యకచ్ఛప । కుళికుళీర
తిమితిమింగల. విక్రమ । క్రమవిహార
తరళతరతుంగక । దంబమంబి
క్షాభ్రిపీఠి సంతానమ । హాపయోధి.

సీ. కపటసూకర మైన । కైటభాసురవైరి
ఖురపుటంబులఁ బరి । క్షుణ్ణ మయ్యె
రఘుకులోద్వహధను । ర్యంత్రముక్తము వస
చిచ్చుటమ్ములవేడిఁ । జేవదరిగెఁ
గుంభసంభవుని హ । స్తాంభోరుహంబున
నాపోసనంబయి । హ్రస్వమొందెఁ
బాషాణముల నభ్ర । భల్ల గోలాంగూల
కపియూధములచేత । కట్టఁబడియె
వనధి యేభంగి నరివచ్చు । ననఁగవచ్చు
వారసాతలగంభీర । వారియగుచు
నపగతాపాయమగుచు శో । భాఢ్య మగుచు
ననుపమం బైన సంతాన । వనధిఁ జూడ.

ఈ శిలాశాసనము సత్తెనపల్లి తాలూకాలోని ఫిరంగిపుర గ్రామమున శ్రీవీరభద్రస్వామివారి యాలయమున కెదుటనున్న శిలాస్తంభముపై చెక్కఁబడి యున్నది. ఈ శాసనమును ఫిరంగిపుర శాసనమని పిలుతురు. సంతానసాగరప్రతిష్ఠాపనము శకసంవత్సరము 1331 యగు విరోధినామసంవత్సర ఫాల్గుణ బహుళ విదియా శుక్రవారము. ఇయ్యది ఇంచుమించుగా క్రీస్తుశకము 1410 సంవత్సర మగును. ఇయ్యది విద్యాధికారిగానున్న శ్రీనాథునిచేత రచింపఁబడెను.

సమాప్తము.



# ఆంధ్రనాటకములు

| | రూ. | అ. | | రూ. | అ. |
|---|---|---|---|---|---|
| కనకాంగి నాటకము చం॥ కే॥ | 1 | 4 | గయోపాఖ్యానము చి॥ ల॥ | 0 | 8 |
| కృష్ణలీల బళ్ళారి పం॥ సు॥ | 1 | 8 | ప్రసన్నయాదవ డిటో | 0 | 8 |
| లవకుశ బళ్ళారిది డిటో | 1 | 8 | పారిజాతాపహరణము | 0 | 8 |
| కన్యాశుల్కము గు॥అ॥ | 1 | 0 | [illegible] డిటో | C | 8 |
| రోషనార కో॥సు॥ | 1 | 4 | పార్వతీపరిణయము డిటో | 0 | 8 |
| తులసీదేవి ము॥ వె॥ | 1 | 0 | కృష్ణవాసవదత్త డిటో | 0 | 0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ కృ॥ | 1 | 0 | పాండవ జననము రా॥ నా॥ | 0 | 10 |
| రసపుత్రవిజయము ఇ॥ య॥ | 1 | 0 | పాండవ ప్రవాసము డిటో | 0 | 12 |
| రాణాప్రతాప్ సింగ్ డిటో | 1 | 0 | పాండవోద్యోగము డిటో | 0 | 12 |
| భక్తరామదాసు కే॥ శ॥ | 1 | 0 | పాండవవిజయము డిటో | 0 | 12 |
| రామదాసు బళ్ళారి డి॥ గో॥ | 1 | 0 | పాండవాశ్వమేధము డిటో | 0 | 12 |
| రామదాసు రా॥ నా॥ | 1 | 0 | అహల్యా శాపవిమోచనము | 0 | 12 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 2 | ద్రౌపది వస్త్రాపహరణము | 1 | 0 |
| చింతామణి చ॥ మా॥ | 1 | 0 | సంపూర్ణరామాయణము గూ॥ కో॥ | 1 | 4 |
| చింతామణి రా॥ నా॥ | 1 | 0 | సంపూర్ణరామాయణము కో॥ స॥ | 1 | 4 |
| వైరాగ్యచింతామణి బ॥ కో॥ | 1 | 0 | సంపూర్ణభారతము పి॥ న॥ | 1 | 4 |
| కంఠాభరణము పా॥ ల॥ | 1 | 0 | మహాభారతము సం॥ శం॥ | 1 | 4 |
| రాధాకృష్ణ డిటో | 0 | 10 | సంగీత కృష్ణలీల డిటో | 1 | 0 |
| సావిత్రి మైలవరంవారు ప్రదర్శించేది శ్రీ॥ స॥ | 1 | 2 | అర్జున ప్రతిజ్ఞ పు॥ వెం॥ | 0 | 12 |
| | | | భీమప్రతిజ్ఞ క॥ కో॥ | 0 | 12 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 2 | భీష్మప్రతిజ్ఞ అ॥ శే॥ | 0 | 12 |
| బుద్ధిమతీవిలాసము డిటో | 1 | 0 | మోహినీ రుక్మాంగద డిటో | 0 | 12 |
| ఉత్తరరాఘవము డిటో | 1 | 0 | రాణీసంయుక్త డిటో | 0 | 8 |
| సాత్రాజితీయము | 1 | 14 | భక్తకబీర్ కో॥ స॥ | 1 | 0 |
| మహానంద బ॥ కో॥ | 1 | 0 | పాదుకాపట్టాభిషేకము ద్రో॥ పి॥ | 0 | 12 |
| జయంత జయపాలము | 0 | 12 | లంకాదహనము | 0 | 10 |
| వేణీసంహారము వా॥ సు॥ | 1 | 0 | వేశ్యాహితబోధిని డిటో | 1 | 0 |
| శకుంతల కం॥ వీ॥ | 1 | 0 | వేశ్యాసంగం పా I | 1 | 0 |
| శకుంతల వా॥ సు॥ | 1 | 0 | డిటో పా II | 0 | 12 |
| అలీబాబా క్రొత్తనాటకం సో॥ రా॥ | 0 | 12 | డిటో పా III | 0 | 8 |
| శ్రీరామపట్టాభిషేకము జ॥ ల॥ | 1 | 0 | సురాజ్ఞా[illegible] జ॥ ల॥ | 0 | 8 |

---

[illegible] వెంకటేశ్వరయ్య బ్రదర్సు, బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

BC

# అనసూయ

ఇది శ్రీయుత అయినాపురపు సోమేశ్వర రావుగారిచే రచియింపబడిన యిప్పుడే ముద్రితమై వెలకు సిద్ధముగానున్నది. అనసూయ సుమతుల పాతివ్రత్య మహాత్మ్యము అనసూయ బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బాలురగా జేయుట మాండవ్యుని శాపము సుమతి సూర్యోదయము గాకుండ శపించుట సుమతి పాతివ్రత్యమహిమవల్ల సుమతి భర్త మరల జీవించుట మొదలగు సంగతులు నిపుణముగా వ్రాయబడియున్నది. ఒకసారి చదివి చూడుడు.

వెల రు 1—0—0

# విచిత్రచిత్రమాల

నవరసభరితమైన యైదంకముల నూతన నాటకము.

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వర రావుగారిచే" రచియింపఁబడి యిప్పుడే ముద్రితమై వెలకు సిద్ధముగా నున్నది అత్యద్భుతంబగు కథ చదివినకొలదియుఁ జవు లూరుచుండును. చిత్రమాలా రాజసింహులకు బరస్పర వైషమ్యము గలుగవలెనని తలంచి చిత్రమాల తండ్రియగు ప్రభాకరుఁ డొనరించిన దురాగతము జదివిన గర్భనిర్భేధ మగును. స్త్రీవిద్యను గూర్చియు, కన్యా వివాహమును గూర్చియు, ప్రభాకరునకును, వాని మంత్రులకు నడచిన వాదన, ప్రతివాదములు శాస్త్రసమ్మతములై యుండును. ఇట్టి పుస్తక మిదివఱకు వెలువడి యుండలేదు. త్వరపడకున్న ద్వితీయ ముద్రణమువఱకు నిరీక్షింప వలసివచ్చును.

వెల రు 0—12—0

---

కసుపులేటి వెంకట్రామయ్య అండు బ్రదర్సు, ఇన్నీసుపేట, రాజమండ్రి



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B138 |
| పుస్తకం పేరు | శ్రీనాథకవిచరిత్రము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినవది | P. Jagamma |
| పేజీలు విడదీసినవది | P. Jagamma |
| పరీక్ష చేసినవది | Aswini PRATHYUSHA |
| పేజీలు సరిచూసినవది | |
| బైండింగు చేసినవది | |
| ప్యాకింగు చేసినవది | NO |
| పరిస్థితి | good |